


### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-8-0. అర్థసంవత్సరపు చందా రు. 2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడి కాపి ఆరు అణాలు. చందాదారులు ఏ మాసమునుండి యైన ప్రారంభము చేయవచ్చును. విడి కాపీలు వలయువారు వాని విలువ మేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలు కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీ పత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలమునకు తక్కువదైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యోద్దేశము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకే ప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంథికము గాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లై కార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# జాగ్రత్తతో నేయబడింది
# గౌరవంగా ధరించబడుతూంది



శౌర్యమైన వస్త్రధారణలో వైచిత్ర్యాలను ప్రారంభించాలంటే మా చేనేత వస్త్రాలలో సరికొత్త నమూనాలను చూడండి.

దేశీయ దుస్తులకుగాని, స్థానిక ముస్తాబునకుగాని, వ్యావహారిక దుస్తులకుగాని, విరామసమయపు ముస్తాబులకుగాని, మీకు నచ్చే చల్లని నూలుబట్టలు మొదలు, మెత్తనిపట్టు ఉన్ని లేక చలిని ఆపే బరువైన వెచ్చని కంబళ్ళు వరకు వివిధ వస్త్రావళి వుంది. విశేష భోగాలను అనుభవించేగలిగే వారికి, పండుగ దుస్తులకు మష్రూలు, హిమ్రూలు, కింఖాబులు గలవు. మీరు కొనే ప్రతిగుడ్డ భారతదేశపు చేమగ్గపు నేతపనివారి వంశీయమగు కుశలత పనితనముతోబాటు నమ్మకమైన విశిష్టతను కలిగి వుంటుంది.







DA/55-122 rG

**ఆల్ ఇండియా హాండ్‌లూమ్ బోర్డు**

98, మౌబ్రేస్ రోడ్డు, మద్రాసు-18; షాహబాగ్ హౌస్, విక్టోరియా రోడ్డు, బాలార్డ్ ఎస్టేటు, బొంబాయి & 7/192 స్వరూప్‌నగర్, కాన్పూర్.

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి.

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౮] ఫిబ్రవరి 1956 [సంచిక ౨

# వి ష య సూ చి క





బావి చెంత నుండి




జయజయ గృహలక్ష్మి సఖీ ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతికా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



# ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలు దేశంయొక్క, ప్రజలయొక్క అభ్యుదయ అభివృద్ధులకుద్దేశించినవి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికా నిర్వహణతో దేశం అన్నివిధాల అభివృద్ధిగాంచగలదని ఆశిద్దాం.

రెండవపంచవర్ష ప్రణాళికా నిర్వహణకు మొత్తం 4800కోట్ల రూపాయల పెట్టుబడి అంచనా వేయబడింది. అందులో ఇరిగేషన్, విద్యుచ్ఛక్తికి 898 కోట్లు, రహదార్లకు 1384 కోట్లు, పరిశ్రమలకు 891 కోట్లు, వ్యవసాయమునకు 565 కోట్లు, సంఘసంక్షేమమునకు 946 కోట్లు, ఈ మొత్తంలో ఆంధ్రరాష్ట్రంలో అభివృద్ధి కార్యక్రమాలకు 116 కోట్లు ప్రత్యేకించబడింది.

ఈ ప్రణాళికా నిర్వహణ ప్రజలకు ఐశ్వర్యం, ఆరోగ్యం, విద్యావిజ్ఞానాలు సమకూర్ప నుద్దేశింపబడినవి. నిరక్షరాస్యతతోపాటు నిరుద్యోగానికి స్వస్తిచెప్పడానికి ప్రత్యేకించి కృషి పొందుపరచబడియుండటం పేర్కొనతగినది.

సాంఘిక సంక్షేమ కార్యక్రమాలకు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో సముచిత స్థానమీయబడింది.

వ్యవసాయమునకు, పరిశ్రమలకు ప్రత్యేకించబడిన మొత్తాలు ప్రజల ఐశ్వ రాన్ని తీర్చిదిద్ది కరువుకాటకాలను పారద్రోలకలుగాలి. సాగు కనువైన భూమి మొత్తం సాగులోకిరావాలి. భారీ పరిశ్రమలకు, కుటీర పరిశ్రమలకు పోటీయనేది లేకుండా ప్రజావసరాలను తీరుస్తూ వర్తక వ్యాపారాలతో పారిశ్రామిక వ్యవస్థ దేశాన్ని ఐశ్వర్యవంతంగా చేయకలుగాలి. పారిశ్రామికరంగం నిరుద్యోగమునకు స్వస్తిచెప్పడానికి వినియోగపడాలి.

ఇరిగేషన్, విద్యుచ్ఛక్తి కార్యక్రమాల నిర్వహణ దేశాన్ని సస్యశ్యామలంగా చేసి పారిశ్రామికంగా సయితము సర్వతోముఖాభివృద్ధిని రూపొంద చేయకలుగాలి.

రహదార్ల అభివృద్ధితో వర్తక వ్యాపారాభివృద్ధి ప్రయాణ వసతులలో సౌల భ్యము ఏర్పడడంతో దేశం సౌభాగ్యవిలసితం కాగలదు.

విద్యా విజ్ఞానాల వ్యాప్తిద్వారా వైభవం, ఆరోగ్యంద్వారా ఐశ్వర్యము సమ కూరనున్నవి.

అవిద్య, దారిద్ర్యం, అనారోగ్యాన్ని పారద్రోలి దేశానికి ప్రజలకు ఆరోగ్య, అభ్యుదయ, ఐశర్య సౌభాగ్యాలను సమకూర్చ నుద్దేశించబడిన ద్వితీయ పంచవర్ష ప్రణాళికకు ప్రజలు సహకరించి అభివృద్ధి కార్యక్రమాలు నిర్విఘ్నంగా సాగేలాగ తోడ్పడాలి.

## పురుషులు — స్త్రీలు

పురుషులు, స్త్రీలు సంఘజీవితంలో సమాన భాగస్వాములు. ఉభయులు హక్కులను, అవకాశములను, బాధ్యతలను సమానంగా పంచుకొని కుటుంబజీవితాన్ని సౌభాగ్యవంతంగా చేయవలసినవారు.

ఈ సందర్భమున పురుషులు స్త్రీలను గౌరవించక పోయినా, స్త్రీలు పురుష లను గౌరవించక పోయినా, కుటుంబవ్యవస్థ కుంటుబడుతుంది. కుటుంబములోని ప్రతి సమస్యను స్త్రీ పురుషులిరువురు బాధ్యతాయుతంగా పరస్పర సహకార సద్భా వాలతో పరిష్కరించుకోవలసియున్నది.

ఈనాడు హిందూ సంఘంలో స్త్రీలను పురుషులు వాస్తవికత కనుగుణ్యంగా గౌరవించడంలేదనే చెప్పాలి. దాంతోబాటు హక్కులను గురించి అవకాశములను గురించి మాత్రం ఆర్భాటము చేస్తూ బాధ్యతలను విస్మరిస్తున్న మహిళాజనంకూడ యున్నది.

స్త్రీ పురుషులలో ఎవరు తప్పటడుగులు వేసినా కుటుంబములో కలకలము తప్పదు. ఉభయులు పరస్పర సద్భావముతో కుటుంబాన్ని ఆనంద నిలయం చేసికోవలసిన బాధ్యత స్త్రీ పురుషులిరువురిమీద యున్నది.

ఇందుకుగాను విశాల హృదయంతో ఉన్నతాశయములు కలిగి స్వార్థానికి, వ్యక్తిగతాభిమాన, ఆధిపత్యవాంఛలకు గురికాకుండా సంఘశ్రేయస్సు నుద్దేశించి త్యాగ సేవాసక్తితో కుటుంబవ్యవస్తను రూపొందించుకోవాల్సిన బాధ్యత స్త్రీ పురుషులపైన సమానంగాకలదు.

గుజరాతు మహిళలు పురుషులు స్త్రీలను గౌరవింపజేయడానికి ఉద్యమాన్ని ప్రారంభించారట. స్త్రీలను గౌరవిస్తామంటూ పురుషులచే ప్రమాణ పత్రాలమీద సంతకాలు చేయించ పూనుకున్నారట. ఇది అభినందించవలసిన విషయమే. స్త్రీ పురుషులిరువురు చిత్తశుద్ధితో ఒకరినొకరు గౌరవించుకొని ఆదరించుకోవలసి యున్నది. ఇందుకుగాను యీ ప్రమాణపత్రాలు వినియోగపడితే సంతోషింపతగిన విషయము.



*

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ.

## ఉపనిషదులు

(గతసంచిక తరువాయి)

అనేజదేకం మనసోజవీయో నైనద్దేవా ఆప్నువన్పూర్వ మర్షత్ ।
తద్ధావతో౽న్యానత్యేతి తిష్ఠత్ తస్మిన్నపో మాతరిశ్వా దధాతి ॥ ౪ ॥

ఆత్మకు చలనములేదు. మనసుకన్న వేగముకలవాడు. దేవతలు అతనిని పరుగున గెలువలేకపోయిరి. వారికన్న ముందు అతడు పరుగిడుచుండెను. కూర్చుని యుండియే అతడు తరుమువారికన్న వేగముగా పోవుచుండును. అతనివల్ల మాతరిశ్వుడు అన్ని జీవుల వ్యవహారములకు సహాయము చేయుచున్నాడు.

ఈ శ్లోకమునుండి, నాలుగు శ్లోకములు వరుసగా, పరమాత్మయొక్క గుణవర్ణనములతో నిండియున్నది. పరమాత్మకు ఎట్టి గుణములును లేవు. భాష, గుణభావములుగాని, అనుభవములుగాని కలిగియుండు ప్రమాణములనుబట్టి ప్రకటనచేయగలవు. అట్టి ప్రమాణములులేకున్న భాష ఉపయోగములేకున్నది. కనుక, ఇచట ఆత్మయొక్క గుణములను తెలిపియుండుటబట్టి వాటి వాక్యార్థములను గమనించకూడదు. ఆద్యంతరహితుని, ఆద్యంత సహిత భాషలో ఇమిడ్చి ప్రకటించ ప్రయత్నించుట వృథాప్రయాసమని ఒప్పుకొనవలసియున్నది. ఈ ఉపనిషదు నాలుగు శ్లోకములతో ఆత్మను ప్రకటింప ప్రయత్నించి, భాషచేత అట్టి భావాతీతుని వర్ణించుట దుష్కర కార్యమని ఈ శ్లోకముల భాషా ధోరణియందే ప్రకటితమగుచున్నది.

"ఆత్మ అచలుడు" అని ఉపనిషదు తెలుపుచున్నది. చలనములేనివాడు అనగా పరమాత్మయుక్త శక్తిహీనతగాని; నిర్వాహక బలములేదనిగాని తలచకూడదు. "అచలుడు" అను పదము, పరమాత్మయొక్క సర్వ వ్యాపకత్వమును తెలుపుచున్నది. చలనము కాల, దేశములనుబట్టి తెలుసుకొనగలము. నేను కుర్చీనుండి మరియొక కుర్చీకి వెళ్లగలను. ఇప్పుడు ఆ మరియొక కుర్చీలో నేనులేను. ఒక వస్తువు ఒక జాగాకు జరుగును అనగా, ఆ జాగాయందు అది ఇప్పుడు లేదని భావము. నేను ఈ కుర్చీలో కూర్చుని యుండిన, ఈ కుర్చీలోనికి నేను జరుగలేను. ఎందుకన నేను ఇదివరకే ఈ కుర్చీనిండుగా వ్యాపించియున్నాను. అటులనే, ఆత్మ చలించజాలడు. ఎందుకన అతడు సర్వవ్యాపి. సర్వవ్యాపియైన సత్య స్వరూపుడు ఎచ్చటికి కదులలేడు. ఎందుకన, అతడు వ్యాపించియుండని స్థలము లేనేలేదు. ఈ భావమునే, "అచలుడు" అను పదముతో మహా ఋషులు తెలుపుచున్నారు.

ఆత్మ మనసుకన్న వేగముకలది అని ఉపనిషదు స్థిరపరచుచున్నది. చలనములేనిది అని చెప్పినంత మాత్రమున ఆత్మకు చలనపరిణామమైన వేగములేదని తెలుపబడుటలేదు. బ్రహ్మాండమున ఉన్నతి వేగము గలది మనసు ఒకటియే. కాని ఆత్మ మనసుకన్న వేగముగా పరుగిడును. ఎందుకన, మనసు తాను తలచగల స్థలమును చేరుటలోగ, మనసు చేరుటకు ముందుగనే ఆత్మ అచ్చట "అస్తి" ఉన్నది అను భావముతో నెలకొనియున్నది. నీవు ఇదివరలో వెళ్ళియుండిన స్థలమును ఇప్పుడు ఒక క్షణములో ఆలోచనవలన చూడవచ్చును. అట్టి ముందుచూచిన స్థలమును నీ యొక్క ఆలోచన ఎట్టి కాలయాపనము లేకనే చేరగలదు. కాని అట్టి ఆలోచన ఆ స్థలమును చేరుటకుముందుగనే "అస్తి" అను సత్య

సిద్ధాంతమున, ఆ స్థితము ఆత్మగుణమును పొంది యున్నది. అనగా ముందేయున్నది. ఇట్లు సత్య స్వరూపుడు - ఆత్మ - మనసు పరుగెత్తి చూడగల స్థలములలోనెల్ల ముందుగనే చేరియున్నది. (అనగా నెలకొనియున్నది.) - అస్తి.

అనగా, ఆత్మను ఇచ్చట సర్వవ్యాపక భావముతో చర్చింపబడుచున్నది. ఇందు రెండు ఉపాయము లున్నవి. ఆ రెండు మార్గములతోనే మనము ప్రపంచ విషయములను తెలుసుకొనుచున్నాము. మనము చలనము తెలుసుకొనుచున్నాము. మనము వేగమును తెలుసుకొనుచున్నాము. మొదటిగుణము లేదని తెలిపి, రెండవగుణమాత్రము ప్రసంగించుటవలన ఆత్మ - ప్రజ్ఞానము - తాను చలనములేని వేగముగానున్నాడు అని ఋషులు విశదీకరించుచున్నారు. ఇది శాస్త్ర సమ్మత విషయము. కాని, భావములందు వ్యతిరేకముగానున్నది. మన విషయములను వెదుకు, బుద్ధి, విమర్శకు ఆతురపడు తెలివి, ఇట్టి గొప్ప సిద్ధాంతములవల్లనే కంపముపొంది, "సర్వవ్యాపక" భావమును తెలుసుకొను యోగ్యత పొందుచున్నది. ప్రజ్ఞానము సర్వవ్యాపకముకలది. అది చలించుటలేదు. కాని బ్రహ్మాండమున చలించునది ఏదిగాని, ఈ ప్రజ్ఞాన ఆవరణమునందే చలించగలిగియున్నది. ఈ భావమునే ఈ శ్లోకమునందలి తొలిపాదమున నొక్కి చెప్పబడియున్నది.

"దేవతలు దానిని పరుగున గెలువలేకపోయిరి. అది వారికి ముందు పరుగిడుచుండెను." ఇట్టి భావము సాధారణబుద్ధిగల పాఠకులను భ్రమింపజేయగలిగి యున్నది. ఇట్టి వాక్యములవల్ల, పక్వము పొందని పాఠకుడు చదివి వాక్యార్థముల గమనించి, గొప్ప శ్రుతుల భావములను గ్రహించలేక నిరాశజెందు చున్నాడు. శ్రుతులు మతధర్మశాస్త్రములు. వాటిని తెలుసుకొనుటకు ఒక విధానమున్నది. వాటి భావ మంతయు మిక్కిలి శాస్త్రీయముగా నుండును.

దేవతలు అను పదము దేవ - అనగా, ప్రకాశము అను మూలమునుండి ఉత్పన్నమైనది. ఇట్లు దేవ అనగా ప్రకాశముకలిగించునది. ఇచ్చట గ్రంథము ననుసరించి, జ్ఞానేంద్రియములు అని అర్థము. శ్రుతి వాఙ్మయమున ఈ పదమును ఇట్టి భావముతో తరచుగా వాడబడియున్నది.

దేవతలు అను పదమునకు ఇట్టి భావార్థమును గమనించి, శ్లోకమును చదివిన యెడల, అందలి అర్థము బాగుగా తెలియగలదు. జ్ఞానేంద్రియములు ఆత్మను అతిక్రమించజాలవు. ఎందుకన, జ్ఞానేంద్రియ వ్యవహారములంతయు, ఆత్మయొక్క సర్వవ్యాపక ఆవరణముననే సాగగలదు. జ్ఞానేంద్రియములు, ప్రజ్ఞాన ఆవరణముననే తమ విషయములను తెలుసుకొనగలుగు చున్నవి. ప్రజ్ఞానమును తొలగించిన, జ్ఞానేంద్రియములు శక్తిని కోలుపోయి నిష్ప్రయోజనముగు చున్నవి.

"మార్పని యుండియే, తరుము వారికన్న వేగముగ పరుగిడుచుండును" ఇందు ఉపనిషదు కర్తల చాతుర్య విశేషమును కనుపించు ఉదాహరణము తెలియు చున్నది. పదముల వ్యూహములో పరమాత్మను స్వాధీనము చేసుకొనగల నిపుణత్వమును చూపు చున్నారు. "అచలము" అనునది, వ్యవహార రహిత స్థాణువువంటిది కాదు. నిజముగా అది, చలమును, అచలమును రెంటిని అతిక్రమించిన స్థితి. ఆత్మ చలములేనట్లు అగుపడుచుండినను, తన స్వభావ గుణముగనే అతిచలనముకలది. రైలు ఇంజనుయందు ఆవిరి తన స్వభావమును వదలక అచలముగానున్న దని చెప్పవలసియున్నది. నీరు వుష్ణమునుపొంది ఆవిరిఅగుచున్నది. ఆవిరి బండిని కదలించుచున్నది. బండి ఆవిరియొక్క శక్తివల్ల లాగబడుచున్నది. అందువల్ల ఆవిరి, తనకు వెనుకవచ్చు పెట్టెలకన్న ముందు పరుగిడుచున్నదని తెలుపవలసియున్నది.

ఇట్లు ఆత్మ సర్వవ్యాపి అగుటయేగాక, చలనముల కెల్ల మూలశక్తిగా నున్నది. చలనములకెల్ల జీవ చైతన్యము కలిగించు శక్తియే ఆత్మ. ఆత్మ అధిష్ఠాన ముండుటవల్లనే, జీవిత వ్యవహారములన్నియు జరుగ గలవు. ఈ భావము శ్లోకమునందలి నాల్గవపాదమున

విశదముగా తెలుపబడియున్నది. ఇచ్చట, ఋషులు, మాతరిశ్వ (ఆకాశమునకు ప్రభువు-వాయువు) -అన్ని జీవ వ్యవహారములను జరుపుచున్నారు. ఎందుకన అతనికి, సర్వవ్యాపక సత్య పరబ్రహ్మమందుండు చైతన్య శక్తి అందుచున్నది. ప్రజ్ఞానము, జీవితము కలసి ఒక పరిపూర్ణమగుచున్నది. అది సర్వత్ర సమముగా వ్యాపించియున్నది. అది సర్వవ్యాపి. ఒక స్థలమున జీవితము వున్నదనిన, అది ప్రజ్ఞాన ప్రకాశమని తెలియవలెను. కనుక పరమాత్మనుండి వాయువు తన చైతన్యశక్తిని పొందుచున్నది. ఆ శక్తివల్ల అది, జీవరూపములను నిలువబెట్టి, పోషించి, రక్షించగల దివ్యరసామర్థ్యమును సంపాదించుకొనుచున్నది. ఈ భావమునే, రాబోవు శ్లోకమున ఇంకను విశదముగ వర్ణించబడుచున్నది.

తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే
తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య
బాహ్యతః ॥ ౫ ॥

౫. ఆత్మ చలించును — అది చలించుటలేదు — అది దూరముగా నున్నది. అది సమీపమున యున్నది. అది అందరిలోను యున్నది. అది వీటి అన్నిటికిని బాహ్యమునకూడా యున్నది.

ముందటి శ్లోకమునందలి భావమును విపులము చేయుటకై మరల చెప్పుచున్నారు. ఇందు గురువు యొక్క ముఖ్య యుద్దేశమంతయు, శిష్యుడు ప్రజ్ఞాన, పరమాత్మ "సర్వవ్యాపి" అను సూక్ష్మ సత్యాంశమును బాగుగ గ్రహించవలెనను భావము. ఈ "సర్వవ్యాపి" అను పదమునకుగల పూర్తి విశేషమును మనకు తెలియుటకును, ఈ భావమునందలి అర్థగాంభీర్యము మనము అనుభవించగల్గుటకును, ఒకే అర్థమును వేరువేరు పద ప్రయోగములతో మరల మరల తెలుపుచున్నారు.

"అది చలించును" — అవును. భూతము, భ్రమింపినవాని దృశ్యమునకు, వికార చేతులును, ఘోర ముఖమును వూపుచున్నట్లు తెలియుచున్నది. కాని, ఈ భూత దృశ్యమునకు ఆధారముగనుండు స్తంభము "చలించుటలేదు." శుద్ధ ఎరుక — ప్రజ్ఞానము — అన్ని ప్రాణులయందుండు జీవశక్తి — తనయొక్క సర్వవ్యాపక శక్తివల్ల చలించుటలేదు. వ్యవహరించుటలేదు. తనయొక్క కీర్తియందు స్థిరభావము కలిగి, తన అస్తిత్వమునందే వ్యవహరించుచుండును. కాని, ప్రకృతి, జీవకళవల్ల శక్తివంతమై, కంపము పొందును, ఉద్రేకముగాంచును. కదలును. వ్యవహరించును. కార్యములు నెరవేర్చును. ఆనందించును.

అలలసామ్యము గమనించిన, సముద్రము, ఎగురుచు, దుముకుచు, తుపానులతో, ఘోరశబ్దము చేయుచున్నదని తెలుపవలసియున్నది. కాని సముద్రముయొక్క సామ్యమును గమనించిన, అలలు మాత్రము సముద్రము కానేరదు. అది తనయొక్క ప్రశాంత, నిర్మల, అచల, గాంభీర్యముతో అగాధ శాంతమును గాంభీర్యమును ప్రకటించుచున్నది. అటులనే, జీవకళయగు ఆత్మ తన సర్వవ్యాపకగుణముతో, అచలుడు వ్యవహరించుటలేదు. పనులుచేయుటలేదు. ప్రకృతి విషయ ఆవరణమును గమనించిన, జీవితము, ఆలోచించుట, అనుభవించుట, విషయ వ్యవహారములుగా కనబడుచున్నది. పడవ కదలుచున్నది. సరసు కదలుటలేదు.

స్టేషనువద్ద నిలిచియుండు రైలుబండిలో కూర్చుని యున్న ప్రయాణీకుడు ఎదుటనుండు వేరు రైలుబండి కదలుట చూచి, తానుకూర్చునియుండు బండి కదలుచున్నదని భ్రమించును. చలించు వస్తువు యొక్క దృష్టికి, చలించని వస్తువు కదలక యుండినను చలించినట్లు అగపడుచున్నది. నావమీద నిలుచుని చూచిన, గట్టునయుండు చెట్లన్నియు కదలిపోవుచున్నట్లు కనబడును. దృశ్యములన్నియు పరస్పర సంబంధము కలవి.

(సశేషము)

# కాలిబాట

## "పగడండి"

మూలం :
**కమలాకాంతవర్మ**

అనువాదం :
**"ప్రవాహ"**

మసక చీకటి. తుషార బిందువులు ఆకు అలముల మీద పడుచూ ముత్యములలాగా మెరయుచున్నాయి. పక్షుల కలకల ధ్వనులతో ఆ చూతవనము ప్రతిధ్వనిస్తూయున్నది. ఆ పరిసరమున ప్రవహించు గంగానదీతరంగములు తీరప్రదేశమును చుంబించినప్పుడు కల్గు మధురనాదము పక్షుల కలరవములకు తోడై ఆ రమణీయ ప్రదేశమును ప్రతిధ్వనింప చేస్తున్నది. కమలినీ కులవల్లభుని అరుణోజ్వల కిరణములు ఆ చూతవనపు చిగురుటాకుల మీదవ్రాలి స్వర్ణ ఛాయను మరిపించుచున్నవి.

కనుచూపు మేరవరకు విరాజిల్లుచున్న ఆ మామిడి తోపులో పెద్ద వటవృక్షము చాల కాలమునుంచి కులపతిలాగా యుండెను. ఆ మామిడి తోపులోని చెట్లన్నియు ఆ వటవృక్షమును ఆదర సత్కారములతో 'వటదాద' యని పిలుస్తున్నాయి. ఆ వటము చాలా వృద్ధావస్థలో యున్నది. కాని దాని హృదయము బాలకుల హృదయముకంటె కోమలమైనది. యువకుల హృదయముకంటె ఉత్సాహవంతమైనది. దానిలో మహర్షులకంటె తపస్సంపన్నత మెండు. ఆ వట వృక్షము రసికులకన్న మిన్న. ఆ వృక్ష ఛాయక్రింద ఎందరో పవళించి అతీతకాలపు వేదననూ ఆహ్లాద పూరిత గాథలను వినుట. చిటపట చినుకులు ఆ వృక్ష శాఖలలో దాగుకొని పవనానందమును అనుభవించు, ఆ పక్షుల ఆహ్లాదమును నేను కూడా ఈ రోజు గుర్తుకు తెచ్చుకొని నివ్వెర పోవుచుండును.

ఆ వృక్షఛాయక్రింద యొకబావి కలదు. ప్రాతః సంధ్యాసమయములలో ఆ గ్రామములోని నారీమణులు వయ్యారంగావస్తూ ఆ మామిడితోపును తమ మధుర స్వరములతో నింపుచూ బావిలోని నీటితో తమ తమ కడవలు నింపుకొని నాట్యము చేయుచున్నారా యన్నట్లుగా వెళ్ళుచుందురు.

బావి నానుకొని యొక పగడండి గలదు. నా జన్మ చరిత్రకు ఆ గ్రామపు యువతులే కారకురాండ్రు.

మానవుని జీవిత చరిత్ర తమ తమ సంబంధీకులతో కాక యితరులతో ప్రారంభమగును. ఆవిధముగా ఎందుకు జరుగుచున్నది తెలియుట లేదు. కాని ఆకస్మాత్తుగా ఎప్పుడు ఎన్నోమాటలు, కించన్మాత్రముగా చూచిన రూపము నిముషము రెండు నిముషముల పరిచయము జీవితచరిత్రకు ముఖ్యఘట్టములు. స్మృతికి అమూల్యనిధిగా యుండిపోవుట మరియు తమ తమ సంబంధీకుల సమాజమంతయు తన జీవితపు వాతావరణమంతయు తామరాకుకు నలువైపులయున్న జలమువలె పొంగుచూ పొంగుచూ వచ్చుట, పొర్లిపోవుట, కదులుచుండుట, నిలకడలేకపోవుట, గోచరించుచున్నది. ఆ విధముగ ఎందుకు జరుగుచున్నదని నేను తెలుసుకొనజాలనైతిని.

వేసవికాలము. రెండు ఝాముల వేళ. వడగాలి, ఆ మామిడితోపులోగూడ యిటు నటు వీచుచున్నది. వటదాద అర్థ నిమీలతనేత్రుడై ఊగుచున్నాడు. అచ్చట ఒక వృక్షమునకు పెనవేసుకొన్న రెండు లతలలో పోట్లాట ప్రారంభమయ్యెను. నేను తన్మయురాలినై ఆ జగడమును చూచుచున్నాను. యింతలో

పగడండీ! ఏమి నిద్రపోయినావా ? అని బావి అడిగెను.

పగడండి (నేను) :- లేదు యిక్కడ రెండు లతలు

జగడమాడుకొనుచున్నవి. ఆ జగడమును నేను వినుచున్నాను.

బావి:- అసలు సంగతేమిటి?

పగడండి:- పిచ్చిజగడము. యిద్దరు మూర్ఖులే.

బావి:- ప్రపంచములో మూర్ఖులెవ్వరు కారు! పరిస్థితి వలన ప్రతి మానవుడు మూర్ఖుడిలా వ్యవహరిస్తాడు. "ఈ వనములో నీ ఒక్కదానివేగా? రేపు మరొక పగడండి పడితే మీ యిరువురిలో జగడమేర్పడుట సంభవించదా?"

పగడండి:- నేను కుపితురాలనైనాను. సాధారణమైన మాటలలో గూడ నన్ను ఉదహరించుటకు నీకేమి అధికారమున్నది?

బావి:- వాటిని మూర్ఖులనుటకు నీకేమి అధికారము కలదు?

పగడండి:- నేను వందసార్లు అంటాను. వెయ్యిసార్లు అంటాను. వారు యిద్దరూ మూర్ఖులే. నీవుకూడా మూర్ఖుడవే. అంతా మూర్ఖులే.

యింతిలో వటవాద మేల్కొని" ఎవరిని మీరు మూర్ఖులంటున్నారని" అడిగెను.

మాటలు ఆగిపోయినవి. బావి మెదలకుండెను. రెండు రోజులవరకు మాటలు లేవు.

నేను తెలుసుకొని వానితో జగడమెందు కాడితిని. దీనిని అతడు తెలుసుకొనలేక పోయినాడు. కనుక నే నాకు పశ్చాత్తాపము అసహ్యత రెండూ కల్గినవి. స్త్రీ ప్రేమవలన విహ్వలత చెందుతుంది. మరి ఉచ్ఛ్వసిత హృదయోద్గారములను ఆపుకొనలేక పోయినప్పుడు జగడమాడుతుంది. స్త్రీకి క్రందితమే అమూల్య ధనము. పోట్లాటే స్త్రీకి ప్రధాన కళ. పోట్లాడి విసుకు చెందుట, విసిగి ఏడ్చుట మరియు యితరులను ఏడ్పించి నవ్వుకొనుట నారీ హృదయమునకు ప్రియమైన విషయములు. పురుషుడెంత చదువరి ఐననూ, సాహిత్యకారుడైననూ, చమత్కారియైననూ, తాత్వికవేత్త ఐననూ ఈ సాధారణ విషయమును తెలుసుకొనలేకపోతే నిజముగా మూర్ఖుడే.

ఈ ఘట్టమేమి కొత్తదికాదు. నిత్యమూ జరుగుచున్నదే. ఏ చిన్నమాటను గురించైనా మేము జగడమాడితే పరస్పరముగా ఒకరికి ఒకరు మాట పట్టింపు వచ్చును. కాని దేనికోసమైతే నేను యిది అంతా చేస్తున్నానో దేనికోసమైతే ఈ పోట్లాటను తెచ్చి పెట్టుచున్నానో అదిమాత్రం ఎప్పుడూ కావటం లేదు. బావి ఎప్పుడూ నన్ను బ్రతిమాలడు. ఆఖరకు నేనే లొంగి మాట్లాడవలసి వస్తున్నది. అప్పుడు బావి ఏమియు జరుగనట్లుగానే మాట్లాడును. కాని అది ఏలాంటి విచిత్ర జీవమోకాని అప్రసన్నత వలన వేదన కల్గదు. ప్రసన్నతవలన ఆహ్లాదము కలుగదు. స్వయంగా విసుగుచెందదు. కేవలము మెదలకుండాయుండును. మాటాడితేనే మరల మాట్లాడుట ప్రారంభించును. ఆ మాటలు వింటే అంతకు ముందన్నదూ ఎట్టి కలహమూ లేనట్లుగా గోచరిస్తుంది. ఓ ఈశ్వరుడా నీ రచనా హృదయమే తన భండారద్వారము నంతయు నాకొరకే తెరచియుంచి నావా?

ఈ ఘటనమీద నేను విశేష ధ్యానముంచలేదు. కాని "ఈ ఆశ్రమమునందు రేపు మరొక డొంకపడితే అపుడు మీ యిద్దరిలో జగడమేర్పడుట సంభవించదా" అని లోగడ బావి అన్నమాటలు అప్పుడప్పుడు నా చెవులలో ప్రతిధ్వనించుచున్నది. ఈ మాటమీద నేనెటువంటి ప్రతివాదన చేసియున్నాను. వానితో జగడమాడినాను. వానిని మూర్ఖుడుగా చేసినాను. నేను ఆడదానిని. మరియు ఆడజాతి బలహీనతే నా బలహీనతని బావి తలచుచుండవచ్చును. మరి వానికి ప్రతివాదము చేయుటకు బదులు నేను స్వయముగా వాని తర్కపు ప్రతివాదన చేసియున్నాను. ఐతే యిప్పుడు మూర్ఖురాలను నేనా లేక అతడా?

ప్రతి నిముషమునకు నా నిర్బలత్వము మీద కోపము వచ్చుచున్నది.

(సశేషము)

# తెల్ల రోజా!

రచయిత్రి :
ఇన్ గే షోల్స్

అనువాదము :
డాక్టరు వి. ఎస్. శర్మ

(డిశంబరు సంచిక తరువాయి)

కాలచక్రం గిరగిర తిరిగిపోతూవుంది. దేశాన్ని, ప్రజల్ని ఎంతో బాగుపరచి, తద్వారా రామ రాజ్యాన్ని సృష్టించివేస్తానని ప్రగల్భాలు పలుకుతూ వున్న హిట్లరూ అతని ముఠా దేశాన్ని కలవరపెట్టి వేశారు. అశాంతి - ఎక్కడచూసినా అశాంతే! ఇంట్లో శాంతిలేదు. బయటకూడా అంతే. ఈ అయోమయంనుంచి దేశానికి, ప్రజకి తరుణోపాయం అనేదిలేదా? ఈ ప్రశ్నే ప్రజాలోకాన్ని అహోరాత్రాలు కలియబెట్టసాగింది. కాని పరిస్థితులు శృతి మించిపోయాక, ప్రజలు ఏంచేయగలుగుతారు? వాళ్ల రోదన అరణ్య రోదనం! దాన్ని వినే నాథుడు ఆ కాలంలో వుంటేగా! ప్రజలు ఆ అగాధంలోనుంచి బయటపడడానికి అవకాశం అనేది ఒకటి వుంటానికి?

ప్రజలు అలసిసొలసిపోయారు. దీన్ని వూతగా తీసుకొని హిట్లరు దేశానికి చిచ్చుపెట్టాడు. అంతేనా మరి! జర్మను దేశానికి ఇరుప్రక్కలనున్న దేశాల మీద అమాంతంగా దాడిచెయ్యలాడు. అక్కడి అమాయకుల్ని పెట్టాలసిన బాధల్ని పెట్టి వాళ్ళనీ యుద్ధాగ్నిలోకి అమాంతంగా లాగివేశాడు. ... దాంతో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. అప్పటికే హాన్స్ డాక్టరు చదువులో నిమగ్నుడై వున్నాడు. దాన్ని అమాంతంగా నిలిపివేసి యుద్ధ రంగంలోకి, తన వయస్సులోవున్న ఇతర యువకుల మల్లె వెళ్లడం ససేమిరా ఇష్టంలేదు. కాని ఆ మహా ప్రవాహంలో హాన్స్ ఏంచేయగలుగుతాడు? రాజాజ్ఞ రాజాజ్ఞ! దాన్ని జవదాటటం మన తరమా? ... వైద్య విద్యార్థులని ఫ్రాన్స్ దేశానికి వెడుతూవున్న సేనలవెంట పంపివేశారు. అంచేత హాన్స్ తప్పని సరిగా వాళ్ళవెంట వెళ్ళవలసివచ్చింది. ఫ్రాన్సులో పరిస్థితులు జర్మను దేశానికి అనుకూలంగా వుండటం మూలాన, వైద్య విద్యార్థుల్లో చాలా మందిని జర్మనీ దేశానికి తిరిగి పంపివేశారు. అదృష్ట వశాత్తు హాన్స్ ఈ జట్టుతో మాతృదేశానికి వచ్చి వేశాడు. విద్యార్థులు విశ్వవిద్యాలయాల్లో తమ చదువుల్ని పూర్తిచేసుకోనవచ్చునని ప్రభుత్వంవారు ప్రకటించారు. కాని సోల్జర్లు సోల్జర్లేకదూ! మిలిటరీ చట్టం ప్రకారం ప్రతిరోజూ వుదయమూ, సాయంకాలమూ, కసరత్తులకు విద్యార్థులు హాజరు కావాలి. విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్ల వుపన్యాసాల్ని వింటూవున్న కాలంలో, ఆస్పత్రుల్లో రోగులకి చికిత్సచేస్తూవున్న సమయాల్లో మిలిటరీ యూనిఫారంలోనే వుండితీరాలి. ఏసమయాన యుద్ధ పనుల్ని చూసుకోడానికి వెళ్లాలని పైనుంచి ఆర్డరు వస్తే, తాము చేస్తూవున్న పనుల్ని కట్టిపెట్టేసి, తటపటాయించక ముందుకి నడవాలసిందే!

దేశమంతా జైలుగా మారిపోయిందనే చెప్పి వేశెయ్యాలి. స్వాతంత్ర్యం అనేది ఆ పరిస్థితుల్లో వుంటేకదా? అథవా అదివున్నా, దాన్ని చవి చూసుకోనడానికి జర్మను జాతికి ఆ వి మావస్థలో అదృష్టం వుంటేగా?

అధికారవర్గంవారి నిరంకుశ చర్యలు మితిమించి పోసాగాయి. వాటిని ప్రతిఘటించినవారు ఆ కాలంలో వున్నారుకాని ఆ సాహస కార్యానికి వారు అనుభవించాలసిన యమయాతన్ని మాటలతో వివరించడం అవసరమా? ఇప్పుడు మనం కళ్ళార చూసినవ్యక్తి, మరో నిమిషంలో మాయమైపోయే వాడు. ఎక్కడికి? ఆ సంగతి ఎవరికి తెలుసు? గోడలకి చెవులువున్నాయి. కళ్లూవున్నాయి. ... పోలీసు గూఢచారులు అకస్మాత్తుగా ఇండ్లలోకి అడుగుపెట్టడం, వాళ్ళనీ, వీళ్ళనీ తమ వెంట రమ్మని ఆజ్ఞాపించటం ... అంతే. తర్వాత పాపంవాళ్లు

ఏమైపోతారో మనమే వూహించుకోవాలి. అంతకన్నా, ఆ అల్లకల్లోలంలో మనమేం చేయగలుగుతాం?

హాన్స్, ప్రజాకోటి ఎదుర్కొంటూన్న ఈ దుర్భరావస్థని తను, ఆ సమయంలోవున్న మ్యూనిచ్ నగరంలో ప్రతిరోజూ కళ్ళార చూస్తూనేవున్నాడు. ఇట్టి కష్టపరంపరల్నే ఇతరచోట్ల ఎదుర్కొంటూ వున్న ప్రజలని గురించి వింటూనేవున్నాడు. ఇలా యమయాతనల్ని అనుభవించేవారి సంఖ్య నానాటికి మించిపోసాగింది.

ఇట్టి సమయంలో ... యుద్ధం హోరాహోరిగా జరిగిపోతూవుంది. లోకమంతా తనకు దాసానుదాసురాలైపోయిందని హిట్లరు మురా చంకలు ఎగిర వేస్తున్న సమయంలో స్వాతంత్ర్య సమరమూ దాని పంథాలోనే అదీ చక్కగా జరిగిపోతూవున్నది. ... ప్రొద్దుటి పోస్టులో, సాయంకాలపు పోస్టులో ప్రతి ఇంటికి వచ్చే వుత్తరాలకట్టలు ఎక్కువైపోసాగాయి.

1940 సం॥ ప్రారంభంలో ... కొత్తరకపు వుత్తరాలు రాసాగాయి. మతాచార్యులకు, మతసంస్థలకు ఇంతవరకూ ప్రభుత్వపు చర్యల్ని ప్రతిఘటించటానికి అంత ధైర్యం లేకపోయింది. కాని యిప్పుడో? ... మతాచార్యులే స్వాతంత్ర్యోద్యమాన్ని నడపటానికి ముందంజవేయసాగారు. వారు నిజపరిస్థితుల్ని లోకానికి తెలపటానికి అవలంబించాలసిన పద్ధతుల్ని తటపటాయించక అవలంబించారు. పూర్వపు రోజుల్లో వచ్చే వుత్తరాలు వేరు. ఇప్పుడు వస్తూవున్న వుత్తరాలు వేరు. ... ఈ రోజుల్లో ఏ తపాలా వుత్తరాల పెట్టెల్లో చూసినా మున్‌స్టర్ నగరం బిషపు మత సంస్థలు ఈ యుద్ధం మూలాన ఎదుర్కొంటూవున్న కష్టపరంపరల్ని గురించి లోకానికి తెలపటానికి ప్రచురించిన వుత్తరపు ప్రతులే! దీన్ని ప్రచురించడానికి ఆ బిషపుకి ఎంతో సాహసం, ధైర్యంవుండి తీరాలి! దాన్ని ప్రతి వూళ్లో, ప్రతి పట్టణంలో వున్న వాళ్ళకు పంపడానికి ఆయనకి చెప్పరానంత శక్తివుండితీరాలి. అట్టి ధైర్య సాహసాలు ఆ సమయానికే రావడం అత్యద్భుతం అనే చెప్పాలి.

“ఈ నగరాన్ని, ముఖ్యంగా మా దేవాలయాన్ని, దానికి సంబంధించిన మత సంస్థల్ని చిందర వందర చేయటానికి ప్రభుత్వం పేరుతో వీళ్లు చేస్తూవున్న గొడవని తలుస్తూవుంటే గుండె గుభేలుమనక మరేమవుతుంది? ... యుద్ధాన్ని ప్రతిఘటిస్తూవున్న వాళ్ళని మంచిదోవకి తీసుకొనిరావడానికి ఇంతవరకూ కాయ శక్తులా ప్రయత్నించాం. కాని ఇప్పుడో? శత్రువు అనేవాడు మనలోనేవున్నాడు. వాడు మనవాడే. వాణ్ణి దోవలోకి తీసుకొనిరావడానికి ఎవరితరం? ప్రశాంతవంతమైన పుణ్యస్థలాన్ని ఎడారిగాచేసి ఆనందిస్తూవున్నాడు. ఏంచేయడానికీ అతనికి శక్తివుంది. అధికారపుయంత్రం అతని అదుపాజ్ఞల్లోనే నడుస్తూ వున్న దుర్భరావస్థలోకి మనం ఈ రోజుల్లో వచ్చి వేయాలసివచ్చింది.

ఈ వారంలో జరిగిన సంఘటన్లే కొంచెం ప్రశాంతంగా ఆలోచిస్తేనా! ... జూలై 12-వ తేదీని పోలీసు గూఢచారులు ఇక్కడ చేయాలసిన క్షోభ నంతా చేసి తమ అధికారుల కోరికల్ని సాంతంగా కొనసాగించామనే వుర్రూతలూగుతున్నారు. ... తరతరాలనుంచి ఈ దేశంలో ప్రజాకోటికి సేవచేస్తూ వున్న ఏసుసేవా సంఘాన్ని పూర్తిగా ధ్వంసం చేయడానికి నిశ్చయించారు. అందులో పనిచేస్తూ వున్న సోదరుల్ని అరెస్టుచేసి, ఆ ప్రాంతంనుంచి తక్షణమే మరోచోటికి వెళ్లితీరాలని వుత్తరువుల్ని జారీచేశారు. వాళ్లు నివసిస్తూవున్న ఇండ్లనూ స్వాధీనం చేసుకున్నారు. ... దీంతో తృప్తిపడే ఘటాలా ఇవి! నచ్చి యాజమాన్యాన ఎంతో త్యాగంతో ప్రజల సాంఘిక సంక్షేమానికి పనిచేస్తూవున్న కాన్వెంటుల్ని ధ్వంసంచేయడానికికూడా ఏమాత్రమూ వెనుకంజ వేసినవారు కారు. ఇవి నేడు ఎట్టి రూపానికి వచ్చాయో మీకే చెప్పదలిస్తే ... ...

... ఈ ముసలంచేసే తాండవాన్ని ఎంతకాలం చూస్తూ వుండాలో? మతసంస్థల రూపాల్నే అమాంతంగా మార్చివేశారు. అవి నేడు పార్టీతదంగాలకి కేంద్రాలుగా మారిపోయాయి. మతసంస్థల్లో ఇంత

వరకూ దీక్షతో పనిచేస్తూవున్న త్యాగమూర్తులు లేడు తలదాచుకోనటానికి ఇండ్లు పోగొట్టుకొని పడాలసిన బాధల్ని పడుతూవున్నారు. వీళ్ళ కష్టనిష్ఠూరాల్ని కనుగొనే నాధుడు అనేవాడు ఈ దేశంలో లేడు వుండేగా! ... ఈ కష్ట నిష్ఠూరాల్ని ప్రభుత్వంవారికి తెలుపుకొన్నాం. కాని వీటిని ఎవరు వింటారు? ... ఆ రోజులు రావాలి. అంత వరకు వోపికతో వేచివుండాలి.

వాళ్లను అంటే లాభం వుంటుందా? ఇంత అధోమయావస్థలోకి రావడానికి కారణం మనం ఇంతవరకూ చూపిన వుదాసీనతే. వాళ్ల పటాటోపాలు మనకు తెలిసీ వాటిని ప్రతిఘటించటానికి ధైర్య సాహసాలులేక, ఆ ప్రవాహానికి స్వాగతం ఇచ్చాం. ఆ పనికి ఫలాన్ని ఇవ్వాళ అనుభవిస్తూ వున్నాము. అంచేత వాళ్లని అంటే లాభం వుంటుందా? తప్పంతా మనదే. ఈ విషయాన్నే మనం తటపటాయించక గ్రహించాలి ... వాళ్లని నిరోధించడానికి శక్తిని దూసితే లాభంలేదు. దానికన్నా మహోత్తరమైన శక్తి ఆత్మశక్తి. ఈ ఆత్మశక్తినే మనం తెలుసుకోవాలి. భగవానుడు దయామయుడు. ఆయనకి మించిన దయ మరెక్కడ వుంటుంది. దాన్నే మనం తెలుసుకోవాలి. సర్వస్వాన్ని భగవానుని పాద పద్మాలకే సమర్పించి, ఆయన సేవనే నిర్విఘ్నంగా కొనసాగించడానికి మనం సర్వావస్థల్లో బద్ధకంకణం కట్టుకొని ధన్యతగాంచాలి. అప్పుడే మనలో వున్న శక్తి దేదీప్యమానంగా వెలుగుతూ వుంటుంది. అదే ఇరుగు పొరుగులవారికీ నిలువనీడ నిస్తూవుంటుంది. వారికి ఈ ఈశ్వర సేవలో నిమగ్నులుగా నుండడానికి కావలసిన శక్తి సంపద నిస్తూవుంటుంది. అదే మనం వాంఛించాలసింది. దాంతోనే మనమీ తుపానునుంచి ప్రజాకోటిని రక్షించాలి......."

ఈ వుత్తరాన్ని హాన్స చదివాక వాడి దృక్ఛథమే పూర్తిగా మారిపోయిందనే చెప్పవచ్చు. "ఇంత ధైర్యంతో మన కష్ట నిష్ఠూరాల్ని చెప్ప గలిగేవారు ఈ రోజుల్లోకూడా వున్నారు అన్నమాట" అంటూ మైమరచి పోయాడు. ఇట్టి ధైర్యాన్నే పూర్తిగా నుంచుకొని అట్టి త్యాగమూర్తులకు సహాయం చేయడానికి తనూ ముందంజ వేయాలని హాన్స నిశ్చయించుకొన్నాడు. ... ... ...

ఆ కాలం మంచిదికాదు. చీకటి, ఇంట్లో చీకటి, బయటా చీకటి. చీకట్లోనుంచి వెలుగులోకి రావడానికి ఎవరికి శక్తి వుంది ఆ రోజుల్లో? ఎవరికి ధైర్యం వుంది? ధైర్యం వున్నా ఆ కార్యాన్ని ఏకాకిగా ఎలా సాధించగలుగుతాడు? "ఈ వుత్తరంలో వున్న విషయాలు అమూల్యాలు. వీటిని ఇతర్లకి తెలపడం అవసరం. ఆ పనినే నిర్విఘ్నంగా కొనసాగించడానికి పూనుకొంటినా......" అని ఏ పనిలో నిమగ్నుడైవున్నా ఆలోచిస్తూ వుండేవాడు.........

యుద్ధాగ్ని అన్నిదేశాల్ని నాశనం చేస్తూవుంది. ఆబాలగోపాలం ఆ బాధ కాగలేక గగ్గోలు మంటూవుంది. రాజ్యాలు జర్మనీ హస్తగతమైన వని పేరేగని, ఆ నిరంకుశాధికారాన్ని ప్రతిఘటించడానికి అన్నిచోట్లలో జరుపబడుతూ వున్న ప్రయత్నాలు ఇక చెప్పడం అనవసరం. జర్మను అధికారులు ఆరోజుల్లో పశ్చిమ అయిరోపాని తమ అదుపాజ్ఞల్లో వుంచుకొన్నామని మురిసిపోతూవున్నా తూర్పుదేశాల ప్రతిఘటనల్ని నిరోధించ జాలక పోయారు. ప్రజాశక్తి యెదుట ఈ ఆధునిక అస్త్రశస్త్రాలూ, ఈ వికట తాండవం ఎలా పని చేయగలుగుతాయి? ... . ...

దేశంలో అలజడి ఎక్కువైపోయింది. యుద్ధ జ్వాలల్లో నాశనమైపోయిన వాళ్ల కుటుంబాల్లోనే కాదు ఈ అశాంతిని మనం చూడడం - నాజీ ఉద్యమాన్నే ప్రారంభపు రోజుల్లో తెగ పొగడిన యువకుల్లో అశాంతి ఎక్కువయింది. నాయకులు జగదేక వీరులు. ఏ పనినైన చేయడానికి సిద్ధం. యువకులు వీరిమాటల్ని తూచ తప్పక నమ్మారు.

ఆ మాటలూ సామాన్యమైనవా! దేశాన్ని రామ రాజ్యంగా మారుస్తామన్నారు. జర్మను కీర్తి ప్రతిష్ఠల్ని, జర్మను సంస్కృతిని చిరస్థాయిగా నిలువ బెట్టడానికి నాజీ ఉద్యమము ప్రారంభించామన్నారు. ఈ పనికి అందరి సహాయ సంపత్తి కావాలని అన్నారు. ఆ పనికోసం ఎట్టి త్యాగాన్ని చేయడానికైన దేశం సిద్ధంగా వుండాలని వుద్ఘోషించారు. ఇవి వున్నత ధర్మాలు. ఈ ఆశయాల్ని యువకులు నమ్మారు. యువకులు వుద్రేకవంతులు. వుత్సాహవంతులు. బండి అనుకొన్న రాజమార్గాన నడచిపోక పెడ మార్గాన కదలడం యువకులు చూశారు...... దాంతో నాజీ ఉద్యమంలోని నిజానిజాలు గుర్తించారు. అట్టి పరిస్థితుల్లో వారు అవలంబించాలసిన పద్ధతులు ఏవో తెలిసికొనడం బ్రహ్మాండం కాదుగా!

# జ్యోతిషం

శ్రీ రమణ్

జగన్నాధ పురమున
జోగయ్యను పంతులు
జ్యోతిష్యము జెప్పుచు
జీవించుచు నుండెను.

అతనియొక్క జ్యోతిషం
బత్తురాల నిజమని,
బల్లగుద్ది పలుకుచు
తృళ్ళిపోవుచుండెను!
ధనముజూడ కొల్లలు
ధాన్యరాసులున్నవి!
పిల్లికింత బిక్షము
పెట్టియైన యెరుగడు!
పల్లెలన్ని దిరుగుచు
ఇల్లు చేరుకొనగను,
ఒక్కనాటి సంధ్యను
చక్క బయలుదేరెను!
దారిలోన యతనిని
చోరు లడ్డగించిరి!
"మేము నేటిరాతిరి
కేమిచేతు మని"యిరి!

దొంగవారి దగ్గర
నంగనాచి మాటలు,
పనికిరావు యనుకొని
పలికెనిట్లు పంతులు!

"రాజుగారి కోటలో
రత్నహార మొక్కటి.
దోచుకొందు రం"చును
దారిబట్ట జూచెను!
కాని ఘనులు దొంగలు
పోనివ్వక గట్టిగ,
పిలకబట్టి యిట్టుల
పలికిరంత అతనితో!

"నిజము జరిగినంతనె
నిన్ను విడిచి పుత్తుము!
కానియడల కళ్ళను
పూని లాగివేతుము!"
వల్లెయంటు బ్రాహ్మడు
మెల్లగాను శలవును
తీసుకొన్న తదుపరి
త్వరగ బయలుదేరెను!
"నేటి రాత్రి బాపని
మాటలెంత సత్యమొ?
తెలుసుకొంద మం"చును
పలికిరొక్క శపథము!

దొంగలంత విప్రుని
ధనమె దోచుకొనగను,
అర్ధరాత్రి వేళను
సద్దుచేయకుండను,

ఇంటిలోకి జొరబడి
ఇచ్చవచ్చినంతగ
ధనమునెల్ల దోచుక
చనిరి మూట గట్టుక !

ప్రొద్దు పొడవ ముందుగ
నిద్దరోయి లేవగ
పంతులంత చూడగ
వింతగాను దోచెను !

గోడు గోడు నవ్వుచు
ఘోష పెట్టి యేడ్చెను!
ఇంత జరుగునంచును
పంతులేమి ఎరుగును ?

జ్ఞానమున్న దంచును
గర్వపడుచు నుండిన,
హీనులైనవారిచే
హానినొందుచుందురు !!

# తీర్పు

శ్రీ బలిజేపల్లి రాఘవరావు

ఆ రోజుల్లో జహంగీరు వైభవోపేతంగా పరిపాలన సాగిస్తున్నాడు. జహంగీరు భోగలాలసుడై పరిపాలనా భారమంతా భార్య అయిన నూర్జహాన్ చేతిలో వుంచేడు. అందుచేత నూర్జహాన్ ఆజ్ఞ సుగ్రీవాజ్ఞగా చెల్లుబడి అవుతూండేది. సాధారణంగా మొగలు స్త్రీలు అంతకుముందు సభకు రావడంగాని, ప్రజల కంటబడడంగాని అరుదుగా వుండేది. కాని నూర్జహాన్ ఘోషా విధానానికి స్వస్తిచెప్పి బాహాటంగా ప్రతివారికి దర్శనమిస్తూ వుండేది.

అప్పటికప్పుడే వేసవి ప్రారంభమైంది. 'ఆగ్రా'లో యెండవేడిమి తీవ్రంగావుంది. రాజమహల్ చుట్టూ వున్న మామిడిచెట్లమీదినుంచి కోయిల హృదయ రంజకంగా కూస్తున్నాది. చలువరాతితో కట్టబడిన మహల్‌లో పన్నీటి జల్లుతో తడిసిన వట్టివేళ్ల పంకాక్రింది - ముఖమల్ సోఫాలో ఆసీనులైన రాజకుటుంబం ప్రచండమైన సూర్యతాపాన్ని లవలేశమైనా ఖాతరు చెయ్యలేదు. ప్రభువుల మనోభావాల్ని గుర్తెరిగి, వారి ఆజ్ఞలను రెప్పపాటులో అమలులో పెట్టించడంకోసం వృద్ధకంచుకి తెరవెనుక ద్వారం దగ్గర యెప్పుడూ ఆసీనుడై వుంటాడు. దర్బారులోకూడా రాణీగారి సింహాసనానికి అనతి దూరంలోవుండి ఆజ్ఞకోసం యెదురుచూస్తూ వుంటాడు.

ఆ నాటి సభకు వృద్ధుడురాలేదు. అతనిస్థానే ఒక యువకుడు నియమించబడ్డాడు. అతనికి దర్బారులో ప్రవేశం కలగడం యిదే ప్రథమం. దేవేంద్ర వైభవంతో తులతూగుతూన్న ఆ మహల్ ఆ బంగారు సింహాసనం చూసేటప్పటికల్లా అతనికళ్లు జిగేల్మన్నాయి. అతడు తను చూసిన దానిని తనే నమ్మలేకపోతున్నాడు. ఇంతవరకూ వింధ్యప్రాంతాల్లో వుండే దుర్గంలో మొక్కలకు నీళ్లుపోసుకుంటూ పొద్దుగుకుంటూన్న వ్యక్తి యీ దర్బారుని చూసి బ్రహ్మాండమైన ఆశ్చర్యాన్ని పొందేడు. అతనికి యెవరు ఉద్యోగులో, యెవరు తాబేదార్లో తెలిసికోడంకూడా కష్టమైపోయింది. తానెందుకక్కడ నియమింపబడ్డాడు? తను చెయ్యవలసిన పనేమిటి? ఎవరిఆజ్ఞ శిరసావహించడం? ఈ ప్రశ్నలన్నీ అతన్ని కంగారు పెట్టేయి. ముఖ్యంగా రాణీగారు సభకు వచ్చి ప్రజలకి దర్శనమియ్యడం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

తను చెయ్యవలసిన పనేమిటో యువకుడికి తెలియలేదు. అతను రెప్పవెయ్యకుండా నూర్జహాన్ వేపే చూస్తూ వుండేవాడు. నూర్జహాన్ ఈ సంగతి కనిపెట్టింది. రాణీగారి తీక్షణ దృష్టులు యువకునిమీద ప్రసరించేయి. ఒక నీచ సేవకుడు మహారాణి అయిన తనవేపు కన్నెత్తి రెప్పవాల్చకుండా చూడడమా? అంతవరకూ రాజులకు సహజమైన గాంభీర్యంతోనూ, మందహాసంతోను తొణికిసలాడుతూన్న ఆమె తీవ్రమైన ముఖం కొద్దిగా కెంపుబారింది. వెంటనే ఆమె "ఎవరీ సేవకుడు? వీనిని యెవరిక్కడ నియమించేరు? వీడితల వెంటనే తీయండి" అని ఆజ్ఞాపించింది. సభ్యులంతా ఆశ్చర్యంతో, భయంతో వణికిపోయేరు.

ప్రక్కగదిలోనే సగం మత్తులో మధురమైన మధువును పానంచేస్తూన్న జహంగీరుకి మత్తు పూర్తిగా వదిలింది. అతనికి సభలో యెందుకీ కలకం బయలుదేరిందో తెలియలేదు. ప్రక్కనున్న అంగరక్షకుడు సంగతంతా విశదీకరించేడు. జహంగీరు వెంటనే నూర్జహాన్‌ని సమీపించి "ఎవరీ సేవకుడు? వీనికెందుకు మరణశిక్ష విధించేవు" అని ప్రశ్నించేడు. ఆమె యింకా నిప్పులు కక్కుతూనేవుంది. "ఎవరో బుద్ధిలేని తులువ. వీడిని కాదు శిక్షించటం. ఇటువంటివాడ్ని కాపలాకి నియమించిన ఆ ఖిల్లేదారు తల తీయించాలి" అన్నది. జహంగీరు వెంటనే అది

సమయం కాదని వూరుకున్నాడు. కాని ఒక్క క్షణం గడిచిన వెంటనే జహంగీరు సింహాసనంనుంచి లేచి "ఈ విషయం రేపు విచారించి న్యాయాన్ని నిర్ణయిస్తాం. అంతవరకూ సేవకుడ్ని ఖైదులో వుంచండి" అనిచెప్పి సభ విడిచి బయటికి వెళ్ళేడు. ఆ నాటి సభ ఈ సంఘటనతో ముగిసింది.

అప్పటికి మధ్యాహ్నం పన్నెండు గంటలై వుంటుంది. జహంగీరు నూర్జహాన్ భోజనాది కృత్యాలు తీర్చుకొన్నారు. జహంగీరు నూర్జహాన్ అందిస్తూన్న తాంబూలపు చిలకలు నములుతూ పచ్చలతో పొదగబడిన హుక్కా పీలుస్తున్నాడు. ఇలా కొంత సేపు జరిగింది. తరువాత జహంగీరు "బీగమ్! ఆ సేవకుడికెందుకు అంత కఠినశిక్ష విధించేవు? అతడు చేసినది అంత పెద్ద నేరమా?" అన్నాడు.

"నేరమా అని మెల్లగా అంటారేం! ఆ నీచుడి సాహసెంత? వాడు మహారాణినైన నావంక కన్నెత్తి రెప్పవాల్చకుండా చూడ్డమే?"

"బేగమ్! వాడి చూపుల్లో యే భావముందో నువ్వు కనిపెట్టేవా?"

"అది నాకు అనవసరం"

"ఐనా విను వాడి చరిత్ర నంతటినీ ఖిల్లేదారువల్ల నేను అప్పుడే తెలుసుకున్నాను. వాడెవడో కాడు. మనవృద్ధకంచుకిని తెలుసుగదా! వాడికొడుకు. ఈ వృద్ధుడు కూడా కొంతకాలం క్రిందట యమున వొడ్డున నున్న మన వుద్యానవనంలో మాలిగా వుండేవాడు. తరువాత మనం విహారానికి వెళ్లి వాడిని ఆంతరంగిక సేవకుడిగా నియమించేం. ఈ యువకుడు వాడి కుమారుడేనని చెప్పేనుగదా! వీడు వింధ్య ప్రాంతంలో వుండే కొండదుర్గంలోని థాణాలో సేవకుడు. తండ్రిని చూసిపోదామని వచ్చేడు. ఈ దినం మనవృద్ధ సేవకుడి శరీరంలో కులాసాగా లేనందువల్ల కుమారుడ్ని తనస్థానంలో నియమించవలసిందిగా ఖిల్లేదారుని కోరేడు. ఆయన అలాగే చూసేడు. వింధ్యాటవులలో వుండేసేవకుడికి ఇక్కడి ఆచారాలూ, యీ రాజభవనం చూసే సరికల్లా ఒకవిధమైన భయం, ఆశ్చర్యం కలిగేయి. ముఖ్యంగా నువ్వు సభకిరావడం, బాహాటంగా అందరికీ దర్శన మివ్వడం అతనికి ఆశ్చర్యానికలిగించింది. ఇంతకుముందు మొగలు స్త్రీలందరూ ఘోషాలో నుండేవారు. నీ వావిధానానికి స్వస్తి చెప్పి నలుగురికీ కనిపించడమే వాని ఆశ్చర్యానికి కారణం. అందుచేతనే వాడు నీ వైపు రెప్పవాల్చకుండా చూసేడు. కాని మరోవుద్దేశం వాడి మనస్సులో లేదని నేను చెప్పగలను." అన్నాడు.

ఈమాటలు విన్న నూర్జహాన్‌కి నోటమాట రాలేదు. కాని ఆమెనిరంకుశాధికారం వమ్ముకావడం ఆమెకి యెంతమాత్రం యిష్టంలేదు. అందుచేత తల పంకించి, "నా ఆజ్ఞకియెదురులేదు. అన్నమాట నిలబెట్టుకోడం ప్రభుధర్మం. లేకపోతే రాజ్య నిర్వహణం దుస్సాధ్యం" అంది.

జహంగీరు "నీవు చెప్పిన మాట అక్షరాలానిజం అన్నమాట ప్రకారం అక్షరాలా జరిపించడం ప్రభుధర్మమే. కాని యీ రాజ్యానికి ప్రభువెవరో నీకు మాత్రం తెలియదా? ఎంత భోగలాలసుడినైనా ఖురాన్ ప్రకారం, మనరాజ్యాంగ పద్ధతిప్రకారం న్యాయ విచారణచేసి శిక్షించే అధికారంనాకేకదూ దఖలుపడింది."

గంభీరమైన యీ ప్రసంగం నూర్జహాన్‌లో బ్రహ్మాండమైన పరిణామాన్ని కలిగించింది. ఆమె హృదయం జహంగీరు యెడల భక్తి ప్రపత్తులతో నిండిపోయింది. ఆమె నమ్రంగా "అలాగే ప్రభూ! మీరుచెప్పిన విధంగానే చేస్తాను." అంది.

"ఇలా అన్నానని నన్ను అపార్థంచేసుకోకు. నేనెంత తెలివైనవాడినైనా సౌందర్యంలో నిన్ను మించలేనుగా!" అన్నాడు. జహంగీరు. మహారాణీ తల వాల్చింది సిగ్గుతో.

మరునాడు సభలో జహంగీరు విచారణ ప్రారంభించేడు. విచారణముగిసింది. పిమ్మట అతడు సభనంతా కలయజూసి యిలా చెప్పేడు."ఇందులో యువక సేవకుడి తప్పేమీ లేదు. అతడు అమాయకుడు. కాని యితనికి దర్బారు సాంప్రదాయాలు తెలియవుగనుక నేటినుండి రాజమహలు ప్రవేశించడానికి వీల్లేదు. అతని జీవితమంతా వింధ్యాటవుల్లోని కొండదుర్గంలో సేవకుడిగాగడపాలి." సభ్యులంతా ఆశ్చర్యంతో ఒకరి నొకరు చూసుకున్నారు. అంతా ఒక్క సారిగా "న్యాయసింహా! జహంగీరు చక్రవర్తికి జై!" అని నినాదాలు చేసేరు.

యువక సేవకుడి కళ్ల వెంట రెండు కన్నీటి బిందువులు జలజలరాలేయి!





# లలిత

"మధుశ్రీ"

రైలుబండి వేగంగా పరుగెడుతున్నది. ఏవిషయం కోసమో-ఎందుకో-ఎండ వాన లెక్కచెయ్యకుండా రాత్రి పగలుకూడా పరుగెట్టి ఒక్కొక్కచోట ఆగి కాస్త విశ్రాంతి తీసుకొనుచున్నది!

ప్లాటుఫారం అంతా గజిబిజిగావుంది. "పూలు... పూలూ" అని వొకడు ... "సోడా .. సోడా" అని మరొకడు "టీ ... టీ" అని ఇంకొకడు ఎవళ్లిష్టమొచ్చినట్లు వాళ్లు గొంతుకలు బ్రద్దలుచేసుకుంటున్నారు! ఈ కేకలకి ప్రయాణీకుల చెవుల్లో తుప్వదుళ్ళిపోతున్నది.

"అబ్బ ఉక్క ... ఉక్క ... గాలిలేదు, ఎప్పటికీ కదలదేమిటి వెధవబండి" అని వొకడు నిట్టూర్చేడు! "అక్కడేదో క్రాసింగ్ వుందిట ఇంకా అరగంటక్కాని కదలదట" అని ప్రక్కనున్న వొక పెద్ద మనిషితో ఏకరు పెట్టేడు మరొకడు!

ఆ మూడో తరగతి పెట్టిలోనే లలిత భాస్కరరావుగార్లు ప్రయాణిస్తున్నారు. భాస్కరంగారు పినతల్లికి జబ్బుగావుంటే చూడ్డానికి వెళ్లేరు, తిరిగి యింటికి చేరుకుంటున్నారు. లలిత భాస్కరంగారి పదేళ్ల కుమార్తె. ఆమె తండ్రిని వొక్క నిముషం వదిలి వుండదు. ఆయనెక్కడికివెడితే అక్కడికి కూడా వెడుతూంటుంది. ఆమెది చాలా అందమయిన విగ్రహం! భాస్కరరావుగార్కి లేక లేక కలిగిన కూతురు కావడంవల్లానూ, ఆమెలోని సుగుణాలవల్లానూ ఆయనకు మంచి అభిప్రాయం నాటుకుంది. ఆమె ఏదడిగితే అది ఆయన తీర్చేవాడు. ఆమెకు చిన్నతనంనుంచీ బీదలంటే జాలీ దయాను. ఆ వయస్సులో ఆమె కిలాంటి ఉద్దేశ్యాలు ఉండడాన్ని ఆయన చాలాసార్లు సంతోషంతో వుప్పొంగిపోయేవారు!

ట్రేయిను కదలుతున్నది. ఆ 'మూవ్మెంటు'లోనే ఒక పధ్నాలుగేళ్ల కుర్రాడు పెట్టెలోకి ఎక్కేడు ... గుంట్రటి కళ్లు ... దుమ్ముకొట్టుకుపోయి - ఎప్పుడూ తైలసంస్కారంలేక రాగిరంగుతో జుట్టు జడలు వేసుకుపోయింది ... ఎముకల బొమ్మలావున్నాడు. చింకిబూట్లూ ... మట్టికొట్టుకుపోయి ... నామమాత్రంగా నిల్చిన గుడ్డలూ చూస్తే ప్రపంచంలోవున్న దరిద్రమంతా అతన్నే వరించినట్లున్నది!

"బాబూ వొక్క కానీ ధర్మం చెయ్యండి ... మీ పాదాలకు దణ్ణం!" వాడి మాట లెవరూ పట్టించుకున్నట్లు కనబడ్డంలేదు.

"ఛో ... ఛో ... దుక్కలావుండి కూలిపని చేసుకోలేవూ? ముష్టిట ... ముష్టి! ... ఇందుకనే మనదేశం యిలా దరిద్రంతో ఏడుస్తున్నది" అంటూ వుపన్యసించేడు వొక పెద్ద మనిషి ప్రక్కనున్న ప్రయాణీకునికేసిచూస్తూ.

ముష్టాడు దీనంగా ఆయన ముఖంలోకిచూసి అక్కడనుండి నెమ్మదిగా వెళ్ళేడు ... లలిత తండ్రి ప్రక్కనవుండి ఇవన్నీ వింటున్నది. ఆమె మనస్సెందుకో బాధపడింది. లేతహృదయం పరుగులెట్టింది.

"నాన్నా –"

"ఏమమ్మా –"

"మనం వాణ్ణి తీసుకువెళ్ళి మన యింట్లో అట్టేపెట్టుకుంటే" అని లలిత తండ్రి నడిగింది.

తండ్రి ఆమె గుణ సౌశీల్యానికి ఆనంద బాష్పాలు రాల్చేడు.

"ఏం తీసుకువెడదామా?"

"ఔను నాన్నా ..."

"ఒరేయ్ ఇలారా" ముష్టివాడి ముఖంగా తిరిగి పిలిచేడు భాస్కరంగారు.

వాడు నీరసంగా అడుగులిడుతూ వచ్చినిలబడ్డాడు.

"నువ్వేంచేయగలవు" అని ఆయన ప్రశ్నించేడు.

"ఏదేనా చిన్న పనులు చేయగలనండి."

"అయితే మాతో వచ్చేస్తావా ?"

"వస్తానండి" వాడి మనస్సెందుకో వేయిమైళ్ల వేగంతో పరుగులెత్తింది !

"అన్నట్టు నీపేరేమిటి ?"

"రాముడండి"

"కాఫీ త్రాగుతాడేమో అడుగు నాన్నా"

భాస్కరంగారు ఫ్లాస్కులోని కాఫీనితీసి వాడి కిచ్చేరు. రాముడు త్రాగి కాస్త తేరుకున్నాడు.

"నీ కెవరైనా వున్నారా ?"

"లేరండి –"

"పాపం" నిట్టూర్చింది లలిత. ఆమె ఎందుకో బాధపడింది !

♦ ♦ ♦

భాస్కరంగారూ, లలితా రాముణ్ణి తీసుకొని యిల్లుజేరేరు. రాము ఎప్పుడూ అల్లాంటి భవనాన్ని చూడలేదు. తను యిల్లాంటి యింట్లో పడ్డానుకదా అని వుప్పొంగిపోయేడు.

"వీడెవరూ" అని దీర్ఘంతీస్తూ ప్రశ్నించింది భాస్కరంగారిని ఆయన భార్య మాణిక్యమ్మ. ఆమె చాలా కటువయిన మనిషి. డబ్బు ఖర్చంటే ఆమె కసలు కిట్టదు, ఆమెదంతా వింత తత్వం !

"రాముడని వొకడు...వీడు మనింట్లో పనిచేయటానికని తీసుకువచ్చేను."

"చాలా మంచివాడే అమ్మా" అని లలిత అందుకుంది.

"ఊఁ ..." విసుగ్గా మూలిగింది.

♦ ♦ ♦

రాముడికి వాళ్ల దొడ్డి యింట్లో వొకగది యిచ్చేరు. ఒక చిన్న మంచం - నాలుగు జతల గుడ్డలు - మంచిజోళ్లూ ఇచ్చేరు. ఇప్పుడు రాముడు మెతికిపోతున్నాడు. సుఖంగా కాలం వెళ్లబుచ్చుతున్నాడు.

రాముడికి చదువుమీద శ్రద్ధకలిగింది... లలిత వొక పలక, పుల్ల కొనియిచ్చింది. అతనికి బళ్లన్నీ చెప్పింది. లలితకి బాగా చదువు కుదిరింది ... అస్తమానం అతని దగ్గరే కూర్చుంటుంది ... అతను వుత్సాహంగా నేర్చుకుంటున్నాడు...లలితని ఎత్తుకు త్రిప్పడమే అతనిపని ... అతని వొళ్లోకి వెళ్ళి కూర్చుంది !

"రాముడూ ... నీకు అమ్మా నాన్నా లేరూ ?"

"లేరమ్మా"

"అయ్యో పాపం మరెలాగ ?" అమాయిక హృదయం తల్లడిల్లింది ... పాపం అందరికీ తల్లీ తండ్రీ వుంటారనుకుంది ... లోకం పోకడ లామెకేం తెలుసును ?

"అదేమమ్మా అలాగంటావు" అని ఎత్తుకొని ముద్దాడేడు.

"తోట్లోకి తీసుకువెళ్లు రాముడూ"

"అలాగేనమ్మా" అంటూ తోట్లోకి తీసుకువెళ్లేడు.

బత్తాయిలూ, నారింజలూ మొదలయిన ఫల జాతులు, రోజా, మల్లి, జాజి, నైట్‌క్వీన్, విరజాజి మొదలయిన పూల జాతులతో ఆ తోట 'ఘుమ ఘుమ'లాడిపోతున్నది. అక్కడే నేలబావి నుయ్యి వొకటికూడావుంది...ఆ నీరు తోడి మొక్కలకుపోస్తారు.

"నాకో కాయ కోసియ్యి రాముడూ" అని లలిత అడిగింది, అడగ్గానే తడవుగా అతను చెట్టు నెక్కేడు ... లలిత వెళ్లి నూతిలోకి తొంగి చూసింది బాల్య చాపల్యంచేత. ఆమెకు కాలు జారింది ... ఆ నూతిలోకి దొర్లిపోయింది. 'రాముడూ' అని పెద్దగా కేక పెట్టింది ... రాముడదిచూసి ఒక్కసారిగా చెట్టు

మీదినుంచి వురికేసి నూతిలోకి అమాంతంగా వురికి లలితని చేతుల్లోకి తీసుకున్నాడు.

లలిత వొణికిపోతున్నది ... భుజాన్న వైచుకొని పూరడించేడు. అతని కళ్ళు నీళ్ళతో నిండేయి ... కొంతసేపటికి లలిత తేరుకుంది. అప్పటినుంచీ రాముడంటే లలితకి అభిమానం మరీ ఎక్కువయింది. ఈ విషయం లలితవెళ్ళి తండ్రితో చెప్పింది. భాస్కరరావుగారు లలితని గుండెలకు హత్తుకున్నాడు ... రాముడి ధైర్యానికి మెచ్చుకొని అప్పటినుంచీ వాడికి కొంత జీతాన్నికూడా ఏర్పాటుచేశారు. రాముడి మీద ఇప్పుడా యింట్లో గౌరవం పెరిగింది.

♦ ♦ ♦

రోజులు వడివడిగా దొర్లుతున్నవి. లలితకేదో జబ్బు బయలుదేరింది వంట్లో! లలిత చిక్కిపోవుచున్నది. "అమ్మాయి కేదేనా మందిప్పించరయ్యగారూ... ఈ మధ్య బొత్తిగా చిక్కిపోవుచున్నారు" అని వంటలక్క చెప్పింది ... "ఆఁ ... అదేంకాదు పిల్ల యిప్పుడు బాగా పొడుగెదుగుతున్నది. జబ్బుకాదు ఏమీ కాదు" అని అన్నాడన్నమాటేకాని లోపల తనకు తెలియకుండా బాధపుడుతున్నది "అమ్మాయి చిక్కిపోవుచున్న దేమా" అని.

తల్లి మాణిక్యమ్మ కెప్పుడూ ఏదో వొక జబ్బు! ఉన్నా లేకపోయినా జబ్బు కల్పించుకొని (Imaginary sickness) పడుకోవడం వొక అలవాటు!

"అయ్యో నా అశక్తత! పిల్లకేమీ చూడలేకపోతున్నానే" అని బాధపడేది. లలితకన్నీ తండ్రే చూస్తున్నాడు.

లలితకి చిన్నతనాన్నుంచీ ఆధ్యాత్మిక చింత ఎక్కువ! దేముడంటుంది ... పూజలంటుంది ... 'పాపంచేస్తే నరకం అనుభవిస్తారు' అంటుంది, ఇవన్నీ చూసి తండ్రి సంతోషిస్తూవుండేవాడు తన కూతురు పతివ్రత అవుతుందని.

నాగస్వరానికి నాగుపాములాగ, ప్రకృతి సౌందర్యానికి ముగ్ధత్వం చెందుతూంటుంది ... అది సాయంకాలం ... సూర్యాస్తమయ సమయం అయింది.

"రాముడూ—" అని లలిత పిలిచింది.

"ఏమమ్మా—"

"నన్ను మన చెరువుగట్టుమీదకి తీసుకువెళ్లు" అని నీరసంగా చెప్పింది. లలితని ఎత్తుకొని రాముడు చెరువుగట్టుమీదకి తీసుకెళ్లేడు. "ఇక్కడ కూర్చుందాం ... దింపు ..." అంటూ అతనినుంచి దిగింది.

అస్తమయ సూర్య కిరణాలు చెరువుమీద ఎఱ్ఱగా అందంగా కనుపిస్తున్నాయి.

"రాముడూ - అలా చూడు ... బంగారురంగు సూర్య కిరణాలు ఎలా పడుతున్నాయో నీటిమీద! అది సరిగ్గా స్వర్గధామంలావుందికదూ! నేనక్కడికి త్వరలో వెడుతున్నాను రాముడూ!!"

"ఎక్కడికి లలితమ్మా?"

లలిత లేచి నిలుచుంది, ఆమె చెక్కిళ్లు ఎరుపెక్కినవి ... ఆమె కళ్ళు మెరుస్తున్నవి. "అక్కడికే స్వర్గానికి!! ... త్వరలో వెడుతున్నాను."

రాముని హృదయం బరువెక్కింది. వాడు ఆరునెలల క్రితంనుంచీ కనిపెడుతూ నేవున్నాడు. లలిత రోజు రోజుకీ నీరసపడుతూందన్న సంగతి. లలిత ఎంత గబగబా లేడిలా పరుగెత్తేది! ఇప్పుడు నడవటమే కష్టంగావుంది! అప్పుడు తనతో రోజల్లా ఆడుకునేది. ఇప్పుడు అసలు ఆటలమీదకి దృష్టే పోవటంలేదు! ఇలా ఆలోచించుకుంటూ కన్నీరు కార్చేడు.

"ఎందుకేడుస్తావు రాముడూ?"

"అబ్బే ఏమీలేదు" అని కళ్లు వొత్తుకున్నాడు.

"అమ్మా లలితా" అని వంటలక్క గట్టిగా కేక పెట్టింది. "నువ్వు త్వరగా లోపలికొచ్చెయ్యి ...

నీవొంట్లో బాగాలేదమకూడాను." ఆమె ఎన్నో సార్లు చెప్పింది "మంచి మందేదైనా అమ్మాయి కిప్పించండి" అని. ఆమెకు తెలుసును లలిత నీరస పడుతూందని ... లలితంటే ఇంట్లో అందరికీ ఎంత ప్రేమ! అందగాా లలితని నెత్తిమీద పెట్టుకు చూస్తారు. వాళ్ళనామె గారవిస్తుంది.

తల్లి మాణిక్యమ్మ ఆ గొడవే పట్టించుకోదు, తన గొడవే తనది.

"చాలా భయంకరమైన వ్యాధికి లలిత గురౌతున్నది" అని లోపల బాధపడి వుంటుంది!

"ఆమె బాగా ఎదుగుతున్నందువల్ల నీరసపడుతున్నద"ని సమాధానపరుచుకుంటున్నాడు భాస్కరం గారు.



కాని కొన్నాళ్ళకు లలితకి జబ్బెక్కువయింది. తండ్రి కంగారుపడి డాక్టరుని పిలిచేడు. మాణిక్యమ్మగారు లలితగొడవేమీ పట్టించుకోనట్లుగావుంది. తనకేదో జబ్బుందని బాధపడుతుంది. కన్నకడుపు కనుక అప్పుడప్పుడు విచారిస్తూ వుంటుంది. లలితకి మళ్ళీ కొన్నాళ్లు తగ్గింది ... మళ్లీ జబ్బు చేస్తున్నది.

"రాముడూ! మనం ఆవ్వేళ రైల్లో ప్రయాణించేటప్పుడు నేనెంతమంది అనాథల్ని చూసేను పాపం! అప్పుడేకాదు ... ఇంకా చాలాసార్లు చూసేను ... నా మనస్సెంత బాధపడింది! వాళ్ళందర్నీ రక్షించగలిగితే నేను సుఖంగా, సంతోషంగా మరణిస్తాను."

ఈమాట లంటూండగానే తండ్రి భాస్కరం గారు అక్కడికి వచ్చేరు. లలిత ఆయన ముఖంలోకిచూసి మోకాళ్ళమీద కూర్చుంటూ ఇలా చెప్పింది.

"నాన్నా - నేనీ విషయం ఇంకా నీ దగ్గర దాచి పెట్టడం నా కిష్టంలేదు. నేను నీతో ఇంక ఎన్నాళ్లో వుండలేను. నేను శాశ్వతంగా వెళ్ళిపోతున్నాను. మళ్లీరాను."

"లేదమ్మా అదెప్పటికీ సాధ్యంకాదు భయపడకు... అలా ఎప్పుడూ మాట్లాడకు..."

"ఇది నిజంనాన్నా ... నాకు తెలుసును... నాకు ఎప్పుడూ బాగా వుండటంలేదు... నాకు స్వర్గానికి వెళ్లాలనివుంది...నిన్నూ... మనవాళ్లందర్నీ వదలి వుండలేనేమో! కాని నేను చూడలేనన్ని దుఃఖభాజనమయిన విషయాలీ ప్రపంచంలో వున్నాయి."

"నీకంత విచారం రావడానికేమి కారణం"

"ఇంతమంది జనం పిన్నా పెద్దా ముసలీ తిండిలేక దరిద్రంతో మాడిపోతూవుంటే నేనెలాచూడగలను? మనలాంటి వాళ్లు కాదా వాళ్లూను...ఎంతమంది ఇళ్లులేక చెట్ల నీడని వానకి తడిసి ఎండకు ఎండి - ఒక పూట తిండివుంటే ఒకపూట లేక ఎల్లా మాడిపోతున్నారో చూశావా? ... నేను సహించలేను.

"మన పనివాళ్లు సుఖంగాలేరా!"

"ఔను మనపనివాళ్లు సుఖంగానే వున్నారు. కాదనను. అందరూ నీలాగేచూస్తారా? నీవు నేను కులాసాగా వుండటమేకావాలి; - అది స్వార్థం కాదా? ... పాపంవాళ్లని చూసేవారెవరూ? ... నాన్నా వాళ్ళందరికీ ఎప్పటికైనా సుఖం వస్తుందా?"

"అది దుస్సాధ్యం లలితా ...నా మటుక్కు నేను చేయగలను. అందరి చేతా ఎవడు చేయించగలడు?"

"నాన్నా నేను చచ్చిపోతాననుకో ... నువ్వు వీళ్ళందర్నీ సుఖపెడతావా? మామూలుగా చూస్తావా?"

"నువ్వు చచ్చిపోవడమా? అదేం మాటలమ్మా అలాగంటావు? అలా ఎప్పుడూ మాట్లాడకు... నాకు నువ్వేపరమావధివి ... నిను చూచుకునే నేను జీవిస్తున్నాను. నీకంటె కావలసిందేముంది నాకీ

ప్రపంచంలో ?" గద్గదస్వరంతో గబగబ అన్నారు భాస్కరంగారు. ఆయనకు భయం ఎక్కువయింది.

"నాన్నా వీళ్లున్నారే ఈ కూలివాళ్లూ, ముష్టి వాళ్లూను - నువ్వు నన్నెంతగా ప్రేమిస్తున్నావో వాళ్లుకూడా వాళ్ళ పిల్లల్ని అంతగానూ ప్రేమిస్తు న్నారు. ప్రేమకి కలిమిలేములతో నిమిత్తంలేదు నాన్నా .. కాకి పిల్ల కాకికిముద్దు ! నాతో వొక్క సారి చెప్పు వీళ్ళందర్నీ నా అనంతరం బాగా చూస్తానని " లలిత ప్రాధేయపూర్వకంగా అడిగింది.

"అలాగే నమ్మా తప్పకుండా... ఈ ప్రపంచంలో నీకు కావలసినదేదైనా చేస్తానమ్మా" భాస్కరం గారి కళ్లు నీళ్లు తిరిగేయి.

"మనిద్దరంకలసి అక్కడకు ఎలా వెడతాం? అక్కడ చాలా ప్రశాంతంగా వుంటుంది" అని ఆమె తండ్రి భుజాన్ని బుగ్గ ఆన్చి పడుకుంది. వొళ్లు సలసల కాగుతుంది.

♦ ♦ ♦

కాలం గడుస్తున్నకొద్దీ లలిత చాలా నీరసపడ జొచ్చింది. ఆమె కసలు బలంలేదు. ఆమెపడు కుని అందమైన వుద్యానంలోని మొక్కల్నీ, చెరువునూ చూచి స్వర్గాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటున్నది. ఇంతట్లోకి తల్లి రాముణ్ణి వేసే కేక గట్టిగా వినిపించిం దామెకు.

"ఒరేయ్ రాముడూ ఏమిట్రా నువ్వు చేసేపని ఎందుకురా పువ్వులేరుతావ్ ?" ఆమె గట్టిగా కేక పెట్టింది.

"లలితమ్మకోసం పువ్వులేరుతున్నా నండమ్మ గారూ"

"అబ్బ ఎంత బాగున్నాయ్ పువ్వులూ ! నువ్వు నాకు రోజూ పువ్వులు తెచ్చి పెడతావా ? " లలిత అడిగింది.

"తప్పకుండానమ్మా" అంటూ గదిలోంచి వెళ్లి పోయేడు "పాపం అభాగ్యుడు నాకేదో వొకటి చెయ్యాలనుకుంటూ వుంటాడు" అనుకుంది.

ఆ సాయంకాలం వంటలక్కని పిలిచింది లలిత "మనయింట్లోవున్న పనివాళ్ళందర్నీ ఇక్కడకి పిలు" అంది. వంటలక్క పిలువగా అందరూ అక్కడికి వచ్చేరు. "అబ్బ ఎంత నీరసపడి పోయింది! " అని వాళ్లందరూ ఆశ్చర్యపడ్డారు. వీళ్ళందర్నీ చూసి తలగడలోంచి మొహంపైకెత్తి "నేను మీకోసం పంపేను. మీరంతనాకు స్నేహి తులు. నేను మిమ్మల్నందర్నీ ప్రేమిస్తున్నాను కాబట్టి! కాని నేను వెళ్ళిపోతున్నాను. ఎక్కడికీ ... గాంధీతాతావాళ్లూ ఎక్కడికి వెళ్లేరో ఆ అందమైన మరోప్రపంచంలోనికి ... మీరంతా భగవంతుణ్ణి రోజూ ప్రార్థించండి...మిమ్మల్నికూడా దేముడక్క డికే తీసుకువస్తాడు ! ఇంక మాట్లాడలేక పడుకుంది. అందరూ దీర్ఘనిశ్వాసం విడిచేరు. వాళ్ళంతా భయ పడిపోతున్నారు. ఆమె వాళ్ళకేసి చూసి మళ్ళీ యిలాగన్నది.

"మీరు భయపడకండి. మీ అందరి మంచికోసం నేను భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. దేముడు తప్పకుండా మీకు మేలు చేస్తాడు. మీరుకూడా దేముణ్ణి ప్రార్థిస్తూవుండండి." అంది చిరునవ్వు తెచ్చుకుంటూ. "నిన్ను భగవంతుడు రక్షించు గాక! " అని వాళ్లు దీవించేరు.

"మీరంతా నన్ను ప్రేమతో చూసేరు. నేను మిమ్మలందర్నీ ప్రేమించేను. మీ అందరికీ తలొకటీ యివ్వదల్చుకున్నాను." అంటూ అందరికీ తలొక పంచలచాపూ చీరా యిచ్చింది. "మీరొక విషయం జ్ఞాపకం వుంచుకోండి. నాయీ చిన్న బహుమతుల్ని చూసి నేను మిమ్మల్ని ప్రేమతో చూచేదాన్నని" అని నన్ను మర్చిపోకండి.

అక్కడున్న అందరూ మాట్లాడలేక పోయేరు. దుఃఖం పెల్లుబికివచ్చింది. కన్నీరు కార్చేరు. మాట్లాడేదిలేక ఆమె యిచ్చే బహుమతుల్ని అందు కున్నారు. ఆఖరికి అందరూ అవతలికి వెళ్ళేరుకాని రాము దక్కడే వున్నాడు.

"రాముడూ! యిదిగో నీకోసం ప్రత్యేకంగా అట్టే పెట్టేను. ఇదిగో ఈ వుంగరం తీసుకో...నాకు తెలుసును నిన్ను నేను మళ్ళీ స్వర్గంలో కలుసుకో గలను. అబ్బ ఎంత హాయిగావుంది స్వర్గాన్ని తల్చుకుంటుంటే!"

లలితకి జబ్బు బాగా ఎక్కువయింది. వంటలక్క రాత్రింబవళ్ళూ మెనే కాచిపెట్టుకూర్చుంటున్నది ఆమెకి పరిచర్యలు చేస్తూ. మాణిక్యమ్మ తన జబ్బు గొడవేదో తను చూసుకొను చున్నది. తండ్రికి పూర్తిగా మతిపోయినట్లుగావుంది. తిండి నిద్రమాని కుర్చీలో కళ్లు మూసుకూర్చున్నాడు లలితని చూడలేక!

'రాముడూ నన్ను వుద్యానంలోకి తీసుకెళ్ళవూ?'

ఆమెనెత్తుకుని తీసుకువెళ్లేడు.

"ఇదిగో ఇదివరకు పాడేవుకదూ బృందావనం పాట. అది వొక్కసారి పాడవూ? ఇంకొక్కసారి వినాలనున్నది.!"

అమెకది ప్రీతికరమైన పాట. రాముడుపాడేడు. లలిత తన్మయంలో మునిగింది.

అదే ఆమె ఆఖరిసారి విన్నది!

♦ ♦ ♦

ఒకనాడు రాముడు వసారాలో నేలమీద పడుకుని వుండటం వంటలక్క చూసింది.

"రాముడూ – నువ్విక్కడ పడుకున్నావేం?"

"లలితమ్మ ఎప్పుడేనా పిలుస్తుందేమోనని"

ఆరోజంతా లలిత చాల కులాసాగావున్నది.

అందరి ముఖాల్లోను ఆశాజ్యోతి మెరిసింది! కాని అర్ధరాత్రయ్యేటప్పటికంతా మారిపోయింది. వంటలక్క రాముణ్ణి పిలిచి డాక్టరుని తీసుకు రమ్మన్నది.

"భాస్కరంగారూ! అమ్మాయికి ఎక్కువగా ఉంది!" వంటలక్క పిలిచింది.

డాక్టరుగారు వచ్చేరు కాని ఆయన చెయ్యి దగ్గ దేమీ లేకపోయింది! లలిత కళ్లు మూసుకునుంది. శ్వాసమాత్రం ఆడుతున్నది. భాస్కరంగా రామె మీదకువంగి "అమ్మాయ్ లలితా–" అని పిలిచేరు. ఆమె తన చక్రాల్లాంటి పెద్దకళ్ళను విప్పి తండ్రికేసి చూసి నవ్వింది! ఆమె వూపిరిపీల్చడానికీ బాధపడుతున్నది. తండ్రి చూడలేక అటు తిరిగి రామంచెయ్యి పట్టుకున్నాడు.

"అలా చూడండయ్యగారూ!" రాముడన్నాడు.

"లలిత వెల్లకిలాపడుకునుంది. ఆమె చిన్నారి మోములో ఆశ్చర్యంకనబడింది....ఆమె స్వర్గం చూస్తున్నట్లుగా ప్రశాంతంగా నవ్వింది! ఆ నవ్వే నిల్చిపోయింది!

# సిల్కు చీరె

శ్రీ నందివాడ కామేశ్వరరావు



సంవత్సరాది పండుగ వస్తున్నాదండీ! అన్నది మా శ్రీమతి. అవును – వస్తూంది అన్నా.

"అబ్బా! అది కాదండీ! మొన్నను గళ్ళచీరె పూలజాకెట్టు కొనమంటే ఉగాది పండుక్కి కొంటానన్నారుగా" అంటూ ఒక ఓరచూపును నామీద విసరింది. అబ్బ! యెంత హాలాహలాన్నయిన మ్రింగగలం కాని ఆ నల్లని కాటుక కళ్ళనుంచి ప్రసరించే చూపును భరించలేము. తమ అవసరం వున్నప్పుడు మొగవాళ్ళతో ముద్దులొలికేటట్లు మాట్లాడటం ఆడవాళ్ళందరికీ సహజమే.

"అలాగేలే" అన్నా మౌనంగా!

"ఇవ్వాళ ఆదివారం ఆఫీసుకి శెలవు కదండీ సాయంత్రం షాపుకి వెళ్దామా" అంది శ్రీమతి.

ఇక పట్టినపట్టు యెలాగ వదలదని సరేనన్నాను.

మధ్యాహ్నం భోజనాలు అయిన తరువాత ఒకసారి విశ్రాంతి తీసుకుందాము కదా అని పడుకున్నాను. సరిగా నాలుగో గంట అయ్యేటప్పటికి వచ్చి లేపేసింది మా ఇల్లాలు. నేను ముఖం కడుక్కొని కాఫీ త్రాగి బయటకు వచ్చేటప్పటికి, చక్కగా ముస్తాబయి ప్రయాణానికి సిద్ధంగావుంది మా లక్ష్మి. ఆవిడ తొందర కొద్దీ గబగబా బట్టలు వేసుకొని ఆ సందట్లో తల దువ్వుకోవడం మర్చిపోయి గుమ్మందిగిపోతున్నాను.

'అదేమిటండీ! దిలీప్ కుమార్ లాగ! చక్కగా తలదువ్వుకోరాదూ' అన్నాది.

'సరేలేవే' అంటూ లోపలికి వెళ్ళి ఒకమాటు తల దువ్వుకొని వచ్చేను.

ఇద్దరంకలసి బజారుకి బయలుదేరాం. త్రోవలో అమ్మగారి నడకలు చూస్తూవుంటే నా గుండెల్లో దడపుట్టిందంటే నమ్మండి. అవి అంజలీదేవి హంసనడకలుట. అబ్బా! యీకాలం పిల్లలకి యేమన్నా తప్పే. అందులో క్రొత్తగా పెళ్ళిచేసుకున్న పెళ్లాం. విధిలేక అన్నా! "లక్ష్మి! ఒక వారగా నడిస్తే బాగుంటుందేమో?"

'అవునండీ! మీలాటి యెత్తుకుకాళ్ళ నడక నాకు చేతకాదు' అంటూ విసురుగా వెళ్ళిపోతూంది.

నవ్వలేక యేడవలేక ఆమె వెనకాలే నడుస్తూ వెళ్ళేను.

'ఏమండీ! యీ బెంగుళూరు షాపుకి వెళ్దామా' అని అడిగింది!

సరే అన్నాను.

మమ్మల్ని చూడగానే షాపువాడు కాలరు సర్దుకుంటూ, "యేమిటి కావాలి అమ్మగారూ" అంటూ కౌంటరు ముందు నిలబడి అడిగేడు.

'చెట్టంత మొగాడిని ముందు నించుంటే నన్ను అడక్కూడదూ? వెధవలోకం ఆడదంటే పడిచస్తుంది' అని మనస్సులో విసుక్కున్నాను.

'శిల్కు చీరెలు వున్నయిటోయి' అని అడిగింది

'ఓ! వున్నాయమ్మా.' అంటూ నాలుగు కట్టలు ముందు పారేశాడు. 'ఇది బెంగుళూరుసిల్కు, ఇది మైసూరు సిల్కులు యింకా యివి బెనారెస్‌ఫైను, సురయా జార్జెట్టు, బినారాంగ్ సిల్కు యేం కావాలో చెప్పండి అమ్మా' అంటూ వున్నాడు.

'యేమండీ! యీ బెనారెస్ ఫైన్ క్వాలిటీ ఎంతో బాగుందికదూ' అంది నా ప్రక్క చూస్తూ.

'సరే! నీ యిష్టం వచ్చింది తీసుకో'! అన్నాను. నామీద నేరం లేకుండాను.

చిన్నగళ్లు, లైట్ కలరు ఎంతో బాగుంది.

'ఓయి! అబ్బాయి! యీ సిల్కు ఆరు గజాలు తియ్యి' అంది.

వాడు ఆరు గజాలు పరుగున చింపేసి పొట్లాంకట్టి ఆమె చేతికి అందిచ్చేడు.

ప్రక్కనున్న గుమస్తా బాబూ అంటూ బిల్లు నాచేతికిచ్చేడు.

బిల్లు చూడగానే నా ఒళ్లు జల్లుమంది. గజం యిరవై రూపాయలుట. నూట యిరవై రూపాయిలు వాడికి చెల్లించి మా యిల్లాలితో యిల్లు చేరుకున్నాను.

ఇంటికొచ్చిన తరువాత తాను కొన్న చీర అందరికీ చూపిస్తూ పొరిగింటి విశాలాక్షమ్మ దగ్గరకు వెళ్లింది. ఆమె చీర యిటు అటూ చూస్తూ 'యేంలక్ష్మీ! యింతాచేసి యిలాటి చీర కొనుకున్నావు' అని అడిగింది. 'యేమండీ నూటయిరవై రూపాయిలు బెనారెస్ సిల్కు' అంది. 'నీ ముఖం. పచ్చిమోసం. యిది లూధియానాసిల్కు. గజం ఎనిమిది రూపాయలుకన్న యెక్కువ వుండదు' అన్నాది మూతి విరుచుకుంటూను. 'ఆ! దగా చేసేడు గాడిదకొడుకు, యింత సొమ్ము మట్టిపాలె! ఆయనకి తెలిస్తే చంపేస్తారు' అంటూ గోడకి చేరబడిపోయింది మా యిల్లాలు. ఆ రోజునుంచి నన్ను చీరెలు కొనమనలేదంటే నమ్మండి. నేను యేరకం కొంటే ఆరకమే కట్టుకునేది.

---

# సీత భర్తతో అడవికి వెళ్లుట

## శ్రీమతి చిలకపాటి సీతాంబ

ఆహా యేమి విధివైపరీత్యము! నిన్నటివరకు యీ యయోధ్యానగరము నిత్యకల్యాణము పచ్చతోరణముగానుండి యీ దినము నిరాశా నిస్పృహలతోటి తేజోహీనమైయున్నది. యిట్టి నిరుత్సాహాంధకారము మానవమాత్రులకేగాక సమస్త ప్రాణికోటికిని సంక్షోభజనకమై యున్నది. మహాభూత సముదాయము గూడ జడమయమైయున్నట్లు తోచుచున్నది. శ్రీ రామచంద్రునియందు సర్వప్రాణులకు గలిగియున్న ప్రేమాతిశయమెంత గురుతరమో యియ్యెడస్పష్టమైనది. కష్టములతోగూడ కొంతయానందము గలిసి వచ్చెననుటకు యీయనంత ప్రజా ప్రేమయే దృష్టాంతము — యీప్రజాదరణము జూడ మొలబంటి దుఃఖమున మోకాలిబంటి సంతోషమున్నట్లున్నది. ఐనను కైక అశనిపాతమువలె కఠోరమగునిట్టి కోరిక నేల గోరఁగలిసి వచ్చెనోగదా. శ్రీరామ చంద్రునియందు ఆమె చూపుచుండిన అపార ప్రేమ, వాత్సల్యము లొక్క-క్షణములో నిట్టి విపరీత స్థితి నొందుటకుగల కారణమేమైయుండునో. కారణమునకేమిగావలెను! సవతితల్లి ప్రేమగదా. తనసవతి కొడుకు పట్టాభిషిక్తుడై సకలప్రజానీకముచే సేవింపబడుచుండ తన సుతుడు తదాజ్ఞావశవర్తియై మసలుటజూచి యోర్వగలదా? “అయ్యో, పొరపడి సాధుశీలయగు కైకేయీ స్వభావమును తప్పుగా భావించితిని.” పాపము శమించుగాక, ఆమె హృదయము నిర్మలమైనది. యీ న్యాయాన్యాయలకాచిత్తమున తావులేదు “యెవ్వరి దుర్బోధలవలననో నేడిట్టి దురాగతము మూడినది” ఐనా, ధైర్య స్థైర్యములకునికిపట్టగు ఉత్తమరాజకాంత యిట్టి కొండెములకు చెవియొగ్గునా “యేమో రాజ్య సంపాదనముగదా, ఆమె మామగారిని ప్రాణముకన్న నెక్కుడుగ ప్రేమించును. మామగారు రామచంద్రుని ప్రాణాధికముగ ప్రేమించి లాలింతురు. ప్రాణసముడగు తనయు నడవుల పాల్జేసి మామగారు మనగలరా. వృద్ధులగు తన భర్త అంత్యకాలమున పుత్రవియోగమున బొగులుచుండ కైకేయి యెట్లు సహించును. తన్మూలమున గల్గబోవు ప్రమాదములకు ప్రవాదములకు తానే తల యొగ్గవలసియుండునుగదా. రాజ్యకాంక్ష అధికారవాంఛ యెంతటి తెగువకైన ప్రేరేపించునేమో. ఇంతకు భరతుని రాజును చేయుటకేగదా యీ ప్రయత్నమంతా. అతడిందుల కంగీకరించునా. భరతుడు సచ్చరితుడు. అన్నయగు రామచంద్రుని దైవముగా భావించి సేవించును. అట్టి పుణ్యమూర్తి యీదారుణ కార్యాచరణమునకియ్యకొనునా. యింతకు రాజ్యకాంక్ష యెంతటివారనైన వశమొనర్చుకొనును గదా. అతనికి మాత్రము రాజ్యవాంఛ యేల లేకుండును, మోమోటము విడచి రాజ్యము తనకిమ్మని తండ్రి నడుగలేక పౌరులను సమ్మతి పరుపనోడి తన మొగము దప్పించి తల్లిచే యీ పథకము బన్నించియుండరాదా! ఐనా అతడు మాత్రము తన ప్రియజనకున కిందుమూలమున గలుగబోవు దారుణ వ్యథనూహింపడా. తనతండ్రి దుఃఖము తనదిగాదా. రాజ్యకాంక్షాపిశాచగ్రస్తులకు తండ్రియెవరు తనయుడెవరు. అక్కటా, మామగారు తన ప్రియపుత్రుని పట్టాభిషేక వృత్తాంతమును ప్రేమంపుటిల్లాలగు కైకమ్మ కెరిగింప కొండంత యుత్సాహముతో నేగిరి. యేనాడో తనకిచ్చిన రెండువరములు నేడు ప్రస్తావించి ఒక వరమునకు రామారణ్యగమనము - రెండవదానికి భరతాభిషేకము చేయుమని కోరుటయా! యీదారుణ వార్తలు వినుటయే తడవుగ మహీపతి మొదలు నరికిన మహీజమువలె మూర్ఛిల్లిరట. తదుపరిమూర్ఛదేరి, పాపీ, కైకా, యీనీ యిచ్చతీరున

భరతుని రాజును చేయుదునుగాని రాముని మాత్ర మడవులకనుపజాలనని పలువిధముల చెప్పిరట. అంతకునూ ఆ కైకమ్మ తాబట్టినకుందేటికి మూడే కాళ్లన్నట్లు తా గోరినట్లే రాముని వనవాసము భరతాభిషేకము జరిగియే తీరవలెను; లేకున్న మీరు ప్రతిజ్ఞాభంగమునకొప్పుకొనుడని ఖండితముగా పల్కెనదట. అందులకు భూపతి ప్రాణములనైన వదలుదును గాని ప్రతిజ్ఞాభంగ మొనర్పజాలనని ఆర్యపుత్రుని వనవాసమున కాజ్ఞాపించిరట. ప్రాణాధికులగు ప్రియపుత్రునైన వదలుకొనగల్గిన మామగారి సత్యనిష్ఠ కొనియాడదగియున్నది. అందులకే రఘువంశ ప్రభువులేగాక సకలరాజలోకముగూడ గర్వింపదగియున్నది.

ఇక, మరది లక్ష్మణుని సోదర ప్రేమ సాటిలేనిదిగదా. రాజాజ్ఞవినుటయే తడవుగా, భార్యావిధేయుడై సకల ప్రజారంజకుడగు, కొమరుని అడవులకంపనున్న యీ వృద్ధభూపతిని సహింపరాదని తండ్రిపై కత్తిదూసెనట. 'అబ్బా, నిన్న కలకలలాడుచు కనులపండువుగానున్న రాజభవనమున నేడెంతెంత లుపద్రవములుప్పతిల్లుచున్నవి. ఆర్యుని యుపశమన వాక్యములచే శాంతుడై తండ్రి పాదముల బడి అగ్రజునితో అడవికేగ ప్రార్థించి యంపకము వడసెనట. ఔరా, సౌమిత్రి అరణ్యవాసము పూర్తియగువరకు నిద్రాహారములు విడచి ఆర్యుని సేవింతునని అసాధారణమగు ప్రతినబూనెనట.

ఇక చెలియలు ఊర్మిళయో, భర్త ఆర్యుని సేవింప వనమునకేగుచు అత్తమామల నుపచరించుచు యింటనుండుమన్న పతిమాట కెదురాడదయ్యె - అయ్యో ప్రతి రక్తపు చుక్కయు యింకజేయు పతి విరహక్లేశము ప్రాణముల నైతము హరింపగ పతి విరహవ్యథ సహించుచు పతియొక్క పవిత్రప్రేమ చిహ్నమగు మంగళసూత్రమును సదా ధ్యానించి పూజించుచు విభునిరాకనతి చొప్పున గురుశుశ్రూష లొనర్చుచు సర్వదా భర్తృస్మరణముతో యితర ప్రపంచమును మరచి సర్వసంగపరిత్యాగినియై, జడత్వమున నున్నది. అట్టి యూర్మిళ పతి భక్తికి సాకేతరాజవంశమును సమస్త ప్రజానీకమును జేజేలు పల్కినది.

అగ్రజుని సేవించుటకు సౌమిత్రియు గురుశుశ్రూషలం సల్పు సోదరి యూర్మిళయు - నిరతము సేవారతియే యీ పుణ్య దంపతుల జీవిత లక్ష్యముగానున్నది.

అది యటుండ ఆర్య పుత్రుడు వనమునకేగిన ఒక్క నిముషమైని నేనిట నిలువగలనా - నిలువజాలనని నిక్కచ్చిగ చెప్పివైచితినిగూడ. అందుల కార్యుడు - జానకీ - నీవసూర్యంపశ్యవు, మితిమీరిన వుష్ణోగ్రతచే మండిపోవు నడవులలో చరింపజాలవు - పదునాలుగేండ్లు పదునాలుగు దినములుగా గడపి మరలి త్వరలో వత్తునని చెప్పి నన్ను నిలుప జూచెను - గాని, అదెట్లు పొసగును - మానుబారిన తీవ మాను దప్పిన వెనుక మట్టిలోబడి యల్లాడవలసినదేగదా. మేఘమును విడచిన మెరపు యేగతి నొందును భయంకర ధ్వనులతో టిరోదించుచు స్థానభ్రష్టయై యధఃపాతాళమున బడిపోవును. మగని కెడమైన మగువగతియు అంతియ. యిట్టి యక్కట్టు లార్యపుత్రు డూహింపడేమి - దైవస్వరూపులగు పెద్దలకు పరిచర్యలు సలుపుచు నింటనుండుమన్న ప్రాణేశుని పల్కులు ఆచరణీయములే. కాని పెద్దల పరిచర్యలు సేయుటకు భర్తృసహితలగు మాండవీశ్రుతకీర్తులున్నారుగదా. యిక ప్రత్యక్ష దైవమగు పతి ననుసరించుటకు నాకభ్యంతరమేమున్నది. ఆ గర్భ శ్రీమంతులగు శుద్ధాంతకాంతలు అడవుల నివసించిన అందందు క్రూర సర్పములవలనను దుష్టరాక్షస గణములచేతను ప్రతిక్షణమును ప్రమాదముల నెదుర్కొనవలసియుండునట. యేమీ అసాధారణ ప్రతాపోన్నతులగు సూర్యకుల సంభవులు వెంటనున్న భూసుతకు కుత్సితులవలని భయమా! దాశరథులు రాఘవధురంధరులుగారా. ప్రాణేశుడు అనివార్యమగు తన పరాక్రమమును తాను గురుతింపడేమో. చిదిమిన పాల్గారు చిన్నారి ప్రాయముననే లోకకంటకయగు తాటకను సంహరించి మారీచ సుబాహుల

మదమణచి మౌనియాగమును రక్షించిన తన సామర్థ్యమును మరచియుండునా. నాడు వేయిమంది బలవంతులచే మోయబడిన శివధనస్సును క్రీడాదండమువలె నెడమచేతనెత్తి విల్లెక్కు బెట్టిన నాటి రఘువీరుని సాటిలేని భుజబలమును ధైర్యస్థైర్యములును నేటికిని కన్నులకు గట్టినట్లున్నవి. అట్టి దోర్దండ విక్రముడు వనవాసమునకుత్సహించు నాకు పిరికిమందు బోయుచుండెనేమి? కాదు కాదు. ప్రాణమునకు ప్రాణమైన అర్ధాంగి అడవులందిడుముల బడుటకు సహింపలేక యీ విధముగా వంకలు గల్పించి వారించుచున్నాడు. రాజ్యభోగములనుభవించునపుడు పురుషునకు భార్య అర్ధాంగియగుటయు, రాజ్యచ్యుతుడై యడవులకేగుతరి ఆ యర్ధాంగి సహచరిగాకుండ బోవునేమి! కష్టసుఖములందు, కలిమిలేములందు సహనము వహించి కూడియుండుటయేగదా ఆర్య సతీ ధర్మము. ధర్మమార్గమున నడచు పడతికి యెందేగినను జయము ధ్రువము. నా ప్రభువడవికి వెడలిననాడు నాకీ మణిమందిరములు, భోగ భాగ్యములు నరకప్రాయములగును. విభునితోగూడి యాఘోరాటవులందే అఖండ సౌఖ్యములందగలను. మంచి చెడ్డలు కష్టసుఖములు సమముగా ననుభవించుటకేగదా దేహధారులీ ప్రపంచమున జన్మించుట - అట్లుండ నాకు సౌఖ్యమేగావలెను, యిది కష్టముల కతీతమగుతావని యొక్క చోబడియుండుట అవివేకము. మణిమయ ప్రాసాదముల నివసించువాడు రాగల కష్టములు రాక మానవు. భయంకరాటవులందు నివసించునపుడైనను లభింపనున్న విజయపరంపరలు సంక్రమించియే తీరును. కలకాలము రాజ్యోపభోగము లనుభవించుచు యీ విధముగా బంగారు పంజరములందు బంధింపబడియుండనేల. ప్రకృతి రమణీయములగు కాననశీమల ప్రకాశవంతములైన పర్వత సవిధముల విహరించి ఆర్య పుత్రునితో ఆనందించెదగాక. వున్నత గిరిశిఖరములపై చిత్రవిచిత్రాకృతులతో విస్తరిల్లు మొయిళ్ల సముదాయములజూచి పురివిచ్చి యాడు నెమ్మి గుంపులతో కలసి మెలగుదును. చల్లని పిల్లగాలి సోకినను బిత్తరి చూపుల బరపుచు చెంగు చెంగున బారిపోవు లేడికన్నెలగూడి ముచ్చటలూర క్రీడింతును. పర్వతసానువులందు దట్టమగు తరుచ్ఛాయలందు విహరించునపుడు ఆర్యపుత్రుని కనుమొరగి కనుపింపక తడవుప్రొద్దు అలయించెద. ఆ - హేమిది. యీ తలపు మనమునకు వచ్చినతోడనే నా కుడికన్నదరుచున్నది. యిదియొక దుర్నిమిత్తము గాదుగదా. కాదు కాదు యిట్టి విశరీర ప్రకృతి ధర్మములు ప్రస్తుత విపరీత పరిస్థితులవలన కలతనొంది యుంటినిగాన కీడు శంకించితిని - ఐననేమి - నేడు మమ్ము వరింపనుండిన అఖండ సామ్రాజ్యలక్ష్మి విముఖయై విడనాడినదిగదా. ఇంతకన్న నత్యాహితమేమున్నది ఉండనిమ్ము. క్షాత్రశోభితులైన రాచబిడ్డలు యెచటనో యేవేళనో యెవరివలననో అనిష్టములు గల్గునని శంకించి స్వప్రయత్నముల నుండి విరమింపరు. ఇంతకు ప్రాణేశుడు నా ప్రయాణమునకు సంపూర్ణముగా ననుమతింపలేదే, అనుమతించక విడచి వెళ్లునాయేమి, ధర్మేచ - అర్థేచ కామేచ నాతిచరామియని సకల దేవతల సముఖమున బల్కిన తనచే పరిగ్రహింపబడిన ధర్మ పత్నిని యింటద్రోసి చిరకాల ప్రవాసమునకేగుటయా. అట్లు జరుగరాదు. జరుగదుగూడ. యెన్ని విధములనైన నన్నిటనిల్పి తానడవులకేగ సముకట్టినేని యూరకొందునా. ఆర్యపుత్రుని పరాక్రమ పౌరుషముల నధిక్షేపించియైన నిష్ఠురాలాపములతోటి రఘువీరుని మనసు నొప్పించియైన ఒప్పించి, వెంటనేగెద. యెటులైనను సీత భర్తతో అడవికి వెళ్లుటయే ధ్రువము.

(విజయవాడ ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో)


ప్రణాళిక ప్రగతి నంబరు 3
పౌరసత్వమునకు
శిక్షణ
ప్రజాస్వామ్య పరిపాలనకు విద్య పునాది. మొదటి పంచవర్ష ప్రణాళికలో 150 కోట్ల రూపాయలు విద్యకై ఏర్పాటు కావింపబడినవి. మార్చి 1955 నం॥కు దేశమున 20,000 నూతన ప్రాథమిక పాఠశాలలు, 5,700 జూనియర్ బేసిక్ పాఠశాలలు స్థాపింపబడినవి. ప్రణాళిక కాలానంతరము ప్రాథమిక పాఠశాలలో 236 లక్షల విద్యార్థులు, ప్రాథమిక సెకండరీ పాఠశాలలో 77 లక్షల విద్యార్థులు ఉంటారు.
ఈ విధముగ ప్రజాస్వామ్య పరిపాలనకు నవ పౌర శిక్షణకు శిక్షణ భూములను ఏర్పరచి పునాదులు వేయబడ్డవి.
ప్రజా సంక్షేమమునకు
ప్రజా ప్రణాళిక

# రిజల్ట్సు

శ్రీ ఏచల శ్రీనివాసులు

—— (౧) ——

"శంకరం ఈ సారైనా బాగా చదివి ప్యాసుకారా" అని పరీక్షలుకాకమునుపు నుండే మా నాన్న అంటూండేవాడు. నేను పరీక్షలు బాగా వ్రాశాను. అంటే నా మట్టుకు నేను బాగా వ్రాశానని తృప్తి పడ్డాను. శలవు లొచ్చాయి. మా చెల్లాయి, "యీసారైనా ప్యాసవుతావా? టపాసవుతావా?" అని వేళాకోళం చేస్తుంది. కడకు మా చెల్లాయికికూడా చులకనయ్యాను.

"రిజల్ట్సు రానే వచ్చాయి. పేపరులో నంబర్లు వరసగా చూస్తున్నాను. చూపు నా నంబరు పరిసరాలలోకే వచ్చింది. కానీ అది ఆ చుట్టుపక్కల ఎక్కడా కనుపించలేదు. మరలా జాగ్రత్తగా కళ్లు పెద్దవిచేసి చూశాను. ఊహూ! కనుచూపుమేరలో కనుపించలేదు. నా నంబరుకు ఏదో వ్యాధి వచ్చివుంటుంది, అది ప్రస్తుతం వాల్తేరు విశ్వకళా పరిషత్తులోనే బెడ్డింగ్ తీసుకొని, నిదానంగా వస్తుందని" అనుకున్నాను.

మా నాన్న అప్పుడే కాఫీ త్రాగి వరండాలోకివచ్చి నేను పేపరు చూస్తుండడం గమనించి,

"శంకరం! ఏమిటి విశేషం! ఈ రోజు పేపరు చూస్తున్నావే? పెద్ద గాలివాన రాబోతుందిరా!" అన్నాడు.

రావటమే వ్యంగ్య ధోరణిలో వచ్చాడే పరీక్ష తప్పానన్న సంగతి తెలిస్తే యింక యెంత మండిపడతాడో! అని రిజల్ట్సు సంగతిచెబుదామా, వద్దాఅని సందిగ్ధంలో పడ్డాను. కడకు ఎలాగయినా యిప్పుడు చెప్పడమే మంచిదనుకొని, బిక్కు బిక్కు మంటూ,

"రిజల్ట్సు నాన్నా" అన్నాను.

"రిజల్ట్సా! ఏమయింది" అన్నాడు నాన్న ఆతృతగా. ఇన్నేళ్లు చదివించి, ఎంతో డబ్బు నా కొరకు వినియోగపరిచిన నాన్నకు ఆ మాత్రం ఆతృత కన్నకొడుకు ఫలితాలమీద వుంటుందని నాకు తెలుసు.

"తప్పాను! నాన్నా" అన్నాను మెల్లగా.

"తప్పావూ! అది నీకు వుగ్గుతో నేర్పిన విద్యేగా! తప్పావంటే తప్పవూ! ఇదేం పత్రికలకు కథలు వ్రాయటమనుకున్నావా? లేక స్కూలులో నాటకాలు వేయటమనుకున్నావా! ఎంత డబ్బు తగ

లేశానురా నీ కోసం! అప్రాచకపు వెధవా! తప్పాడట తప్పాడు!''

నాన్నగారికి కోపం హెచ్చింది. నా హృదయం విషాదపూరిత మయింది. ఎందుకీ బ్రతుకనిపించింది. మౌనం వహించాను.

''ఇంక నీకు చదువూ లేదు గిదువూ లేదు. పో వెధవా! నీ యిష్టంవచ్చినట్లు నాటకాలు వేసుకుంటూ వూరూర తిరుగుతూ జీవించుపోరా!'' అని మండిపడుతూ ఆవేశంతో ఆఫీసుకెళ్లాడు.

అప్పటికే నా కనుకొలకుల్లో నీళ్లు నిండాయి. నాన్నకింత కోపంవస్తుందని నేను కలలోకూడా అనుకోలేదు. అవును మరి ఒకే పరీక్షలో మూడుసార్లు తప్పానంటే కోపంరాదూ! నేనింతగా ఆరాధించినకళ నాకింత ద్రోహం చేస్తుందనుకోలేదు. నాకిది ముందుగా తెలిసివుంటే దీనిలోకి అడుగుపెట్టేవాడినికాదు, అని అనుకున్నాను.

''నిజం! నిజం'' అన్నట్లుగా నా కన్నీటి చుక్కలు చేతిలోనున్న పేపరులో రిజల్టుమీదపడ్డాయి.

''ఏమిటి నా భవిష్యత్తు? ఏమిటి నా వర్తమానం?'' అని స్వగతంగా ప్రశ్నించుకున్నాను. దానికి జవాబుగా ఆరాధించిన కళ! ప్రేరేపించిన ప్రళయం'' అని నా చేతిలోని రుమాలు నా కళ్ల నీళ్లను తుడిచింది.

ప్రళయమా? ప్రశ్న-అదే ప్రళయం! యిదే మరణం అని జవాబు హృదయంలో ఓమారు మూల గొణిగింది. మన ప్రాచీనకవులెవరూ విద్యకూ, మరణానికీ సంబంధం కల్పించలేదు నాకు తెలిసి. విద్యకోసం మరణిస్తారా? మరణంకోసం విద్య నభ్యసిస్తారా? - ఏమిటీ పిచ్చి ప్రశ్నలు? పిచ్చి ప్రశ్నలా? కాదు. భవిష్యత్ ప్రశ్నలు. హృదయం వికలమైంది.

''నాన్నను యింతగా కష్టపెట్టిన నువ్వు యిక జీవించకూడదు. పో! ఈ లోకం నుండి! నీకు యిక్కడ స్థలంలేదు. భూభారమైనా కాస్త తగ్గుతుంది'' అని అంతరాత్మ ఘోషిస్తోంది.

అదే ఉత్తమమైన మార్గం అనుకున్నాను. సరాసరి వూరిబయటవున్న తోటలోనికివచ్చాను. అక్కడ గన్నేరుకాయలచెట్లున్నాయి. ఓపది గన్నేరుకాయలుకోశాను. వాటిని తినేశాను. పగలు పదిగంటల సమయం అప్పుడు. కడుపులోఏదో పేగులను మెలిపెట్టినట్లుగా బాధనిపించింది. సొమ్మసిలి ఆ చెట్టుకానుకునే కూర్చున్నాను.

ఆ కాయలు తినడంవల్ల శారీరకంగా బాధగావున్నా, యిక కొద్ది క్షణాలలో

మరణించబోతున్నానని తెలియగానే మానసికంగా ఏదో తెలియనటువంటి అర్థరహితమయిన తృప్తిని పొందగలిగాను. అప్పటికే నాకు మైకం క్రమ్మింది కళ్ళు మూసుకుపోతున్నాయి.

ఇది జరిగిన నాలుగైదు గంటల తర్వాత నాకు స్మృతివచ్చింది. కళ్ళు తెరిచాను. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. నాన్న, చెల్లాయి డాక్టరు నర్సు, వగైరాలందరూ హాస్పిటలలో నేనున్న బెడ్ చుట్టూవున్నారు దీనవదనాలతో. నా స్పృహతో డాక్టరు నాన్నకు Hopes యిచ్చాడు.

నాన్న చితికిన హృదయంతో - "శంకరం! నాయనా! నేనేదో భద్రేకంలో అన్నానని యిలా చేసుకుంటావుటా? ప్రాణాలతో చెలగాటమట్రా! మీ అమ్మ పరలోకంలో యీ విషాద ఘట్టానికి ఎంతగా దుఃఖిస్తుందో! అన్ని ఆశలూ నీ మీద పెట్టుకొని జీవిస్తున్నాను గదట్రా" అన్నాడు ఏడుపుముఖం పెట్టి. చెల్లాయి వెక్కి వెక్కి ఏడుస్తోంది.

నాన్న యింతగా పశ్చాత్తాపపడుతాడని అనుకోలేదు. ఎందుకిలా వీరిని దుఃఖపెట్టానా అని నేనే కించపడ్డాను. ఆ తోటలోనివాళ్ళు నన్నిక్కడకి చేర్చకపోతే నేనేమయివుండేవాడినో అనుకున్నాను.

ఇంతలో పోస్టుమేన్ ఓ కవరందించేడు. డాక్టరు చించిచదివాడు. అది యూనివరిట్సీ నుండి వచ్చింది. నేనుప్యాసయాననీ, పేపర్లో నా నంబరు పొరపాటున తప్పిందనీ. ఆ మాటలకు, నా ఆనందానికి మేరలేదు. నా ఆరోగ్యం పూర్తిగా వచ్చినట్లయింది. డాక్టరు "యిక మీ అబ్బాయికేంపర్వాలేదు" అని నవ్వుతూ నర్సుతో వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత కొన్ని రోజులకు స్కూలుకెళ్ళి నా రిజిస్టరు తీసుకొనివస్తున్నాను. దారిలో మా స్నేహితుడు రామం కనుపించాడు నిరుత్సాహంగా కనుపించాడు. నేను "ఏరా! దిగులుగావున్నావు" అన్నాను. రామం ప్యాసయ్యాడు, అతని విచారానికి కారణం తెలియలేదు. వాడు "ఏంలేదురా! నీ గురించే! ఈ సారైనా ప్యాసుకారా" అన్నాడు.

ఉలిక్కిపడ్డాను. "ఏమిట్రోయ్ నేను ప్యాసుకాలేదనుకుంటున్నావా మనం ప్యాసయేంరా! యూనివర్సిటీ నుండి మొన్ననే లెటరొచ్చింది." రామం విస్తుపోయాడు. "ఏమిటీ! నిజంగా నువ్వు ప్యాసయ్యావా? పేపరులో నీ నంబరు కనుపించలేదేమరి" అన్నాడు.

'అవునురా! మనం స్పెషల్ గా ప్యాసయ్యాం. చూడు కావలిస్తే రిజిస్టరు' అన్నాను గర్వంగా.

[97 పేజి చూడుడు]

చేశానురా నీ కోసం! అప్రాచకపు వెధవా! తప్పాడట తప్పాడు!''

నాన్నగారికి కోపం హెచ్చింది. నా హృదయం విషాదపూరిత మయింది. ఎందుకీ బ్రతుకనిపించింది. మౌనం వహించాను.

''ఇంక నీకు చదువూ లేదు గిదువూ లేదు. పో వెధవా! నీ యిష్టంవచ్చినట్లు నాటకాలు వేసుకుంటూ వూరూర తిరుగుతూ జీవించుపోరా!'' అని మండిపడుతూ ఆవేశంతో ఆఫీసుకెళ్లాడు.

అప్పటికే నా కనుకొలకుల్లో నీళ్లు నిండాయి. నాన్నకింత కోపంవస్తుందని నేను కలలోకూడా అనుకోలేదు. అవును మరి ఒకే పరీక్షలో మూడుసార్లు తప్పానంటే కోపంరాదూ! నేనింతగా ఆరాధించినకళ నాకింత ద్రోహం చేస్తుందనుకోలేదు. నాకిది ముందుగా తెలిసివుంటే దీనిలోకి అడుగుపెట్టేవాడినికాదు, అని అనుకున్నాను.

''నిజం! నిజం'' అన్నట్లుగా నా కన్నీటి చుక్కలు చేతిలోనున్న పేపరులో రిజల్టుమీదపడ్డాయి.

''ఏమిటి నా భవిష్యత్తు? ఏమిటి నా వర్తమానం?''అని స్వగతంగా ప్రశ్నించుకున్నాను. దానికి జవాబుగా ఆరాధించిన కళ! ప్రేరేపించిన ప్రళయం'' అని నా చేతిలోని రుమాలు నా కళ్ల నీళ్లను తుడిచింది.

ప్రళయమా? ప్రశ్న-అదే ప్రళయం! యిదే మరణం అని జవాబు హృదయంలో ఓ మూరు మూల గొణిగింది. మన ప్రాచీనకవులెవరూ విద్యకూ, మరణానికీ సంబంధం కల్పించలేదు నాకు తెలిసి. విద్యకోసం మరణిస్తారా? మరణంకోసం విద్య నభ్యసిస్తారా? - ఏమిటీ పిచ్చి ప్రశ్నలు? పిచ్చి ప్రశ్నలా? కాదు. భవిష్యత్ ప్రశ్నలు. హృదయం వికలమైంది.

''నాన్నను యింతగా కష్టపెట్టిన నువ్వు యిక జీవించకూడదు. పో! ఈ లోకం నుండి! నీకు యిక్కడ స్థలంలేదు. భూభారమైనా కాస్త తగ్గుతుంది'' అని అంతరాత్మ ఘోషిస్తోంది.

అదే ఉత్తమమయిన మార్గం అనుకున్నాను. సరాసరి వూరిబయటవున్న తోటలోనికివచ్చాను. అక్కడ గన్నేరు కాయలచెట్లున్నాయి. ఓపది గన్నేరు కాయలుకోశాను. వాటిని తినేశాను. పగలు పదిగంటల సమయం అప్పుడు. కడుపులోవేదో పేగులను మెలిపెట్టినట్లుగా బాధనిపించింది. సొమ్మసిలి ఆ చెట్టు కానుకునే కూర్చున్నాను.

ఆ కాయలు తినడంవల్ల శారీరకంగా బాధగావున్నా, యిక కొద్ది క్షణాలలో

# తుమ్మ ముళ్లు

శ్రీ 'విజయ – రాఘవ'



(గతసంచిక తరువాయి)

గంగాధరరావు మంచి భావుకుల్లో ఒకడు. మల్లిఖార్జునరావుకి గంగాధరరావు అండలేకపోతే ఆ వూళ్లో అతను అంతకాలం వుండలేక పోయే వాడేమో అనిపిస్తుంది. ఆనాడు మామూలు వేళ దాటింతరువాత భోజనంచేసాడు, మల్లిఖార్జునరావు. ఆ మధ్యాహ్నంపూట సరోజిని మూటాముల్లే సర్దుతోంది. బ్రహ్మాజీరావు కుటుంబరావు యింటికి వెళ్లాడు. కుటుంబరావంటే ప్రసాదరావు తమ్ముడు కాదు. వీడు మరోక కుటుంబరావు. ఆ వూళ్లో కల్లా సపర్నాసి. తాజ్ మహల్ బీడీ కాలుస్తూ మల్లిఖార్జునరావు -

"ఎక్కడికో ప్రయాణమవుతున్నట్లున్నావ్"

"మానాన్నొచ్చాడుగా - పండక్కి గొల్లపల్లి తీసికెళ్తా నంటున్నాడు - వెడదామని బయలుదేరుతున్నా." సరోజిని చీరలు మడతపెట్టుకొంటూ అన్నది.

"అయితే కోలవెన్ను రావన్నమాటేగా!"_

"ఎందుకు? గొల్లపల్లి పోతున్నాగా" -

"ఎందుకేమిటి? శలవులకు యిద్దరం పోదామనుకున్నాంగా!"

"మా నాన్న నన్నుతీసికెళ్తానంటున్నప్పుడు మరి... మీతో యెలాగ." -

"అదేమిటి? తలకాయలేకుండా మాట్లాడుతావ్. మీనాన్న ముఖ్యమా! నేను ముఖ్యమా!" మల్లిఖార్జునరావు తాడో, బొంగరమో తేల్చుకొన్నట్టుగానే మాట్లాడదల్చాడు.

"ఏమో! నేను గొల్లపల్లి వెళ్లదామనుకొంటున్నా, వెడతానుకూడా, కోలవెన్ను రాను." యీ మాటలు సరోజిని నోటినుండి, ఆలిండియా రేడియో తెలుగు వార్తలు చదివే రంగనాధరావు గొంతులోంచి వచ్చేవిగా వచ్చేటప్పటికి, మల్లిఖార్జునరావుకి బుర్ర తిరిగి పోయింది.

"పతియే సతులకు పరమదైవమన్న సూక్తులు యిటువంటి వాళ్లుండబట్టి భ్రష్టమై పోతున్నాయి. చేసుకొన్న పురుషున్ని వదిలిపెట్టి పుట్టింటికి వెడతాననే స్త్రీని యేమని వర్ణించారో గ్రంథాల్లో అతనికి తెలియకుండా పోయింది. పెళ్లినాడు పంచరత్నాలని, ఆశీస్సులని పద్యాలు వ్రాసినవారు మాదాంపత్యం యిలావుండాలని, అలా వుండాలని యెవరెవరితోనే వూరికేపోల్చి వర్ణించి బాగుపడండి" అని చెప్పారు కాని, "యిలాంటి జీవితం ముందుముందు నీకు సంభవింపపోతోందని, జాగ్రత్తగా వుండమని యెవ్వరూ హెచ్చరికకూడా చెయ్యలేక పోయేరే" అని పరిపరి విధాల మల్లిఖార్జునరావు దారితెన్నూ దొరక్క ఆలోచనలోనే వున్నాడు.

ఆ రోజు సాయంత్రమే నాలుగంటలకు బ్రహ్మాజీరావుతో సరోజిని బయలుదేరింది. వాగిట గుమ్మంలో బ్రహ్మాజీవెనుక సరోజిని నిల్చుండటం, మల్లిఖార్జునరావు వసారాలో పడకకుర్చీలో పడుకోవడం గంగాధరరావు చూస్తూనే వున్నాడు. వాకిట్లోకి వచ్చిన గుర్రపుబండిలో పెట్టె, రెండు సంచులతో సహా సరోజిని యెక్కి కూర్చొంది. బ్రహ్మాజీరావు బండిదగ్గర నిల్చుని -

"మల్లిఖార్జునరావ్" - అన్నాడు.

"ఏమిటన్నట్లు" తలెత్తి చూసాడు.

"మరి మేం వెడుతున్నాం, జాగ్రత్త" అన్నాడు.

"జాగ్రత్తండీ! - వెళ్ళిగానే వుత్తరం వ్రాస్తా - జవాబు వ్రాయండి —" ఖండి కదులుతున్న సమయంలో సరోజిని ఆఖరి మాటలు మల్లిఖార్జునరావుకి అరికాలి మంట నెత్తికెక్కేలాగు చేసాయి.

"సగం పీడావదిలింది -" అని నిట్టూర్పు విడిచి చివరికొచ్చిన బీడిని ఆఖరి దమ్ము గట్టిగాలాగి బలంకొద్దీ విసిరాడు. పైపంచతో మొహంతుడుచుకొన్నాడు. యింతలో గంగాధరరావు మెల్లగా వచ్చి ఎదురుగావున్న మంచం వాల్చుకొని కూర్చున్నాడు.

"బ్రహ్మాజీరావు యింకా యేమిటీ సిగ్గులేకుండా అంటూ వెళ్ళాడు" - గంగాధరరావు చిరాగ్గా అడిగాడు.

"సిగ్గులేని మొండి పీనుగు. యేదో వాగాడు.." మల్లిఖార్జునరావు అంతకన్నా మంచి తిట్టు తిట్టలేకపోయాడు.

"ఏదో జాగ్రత్త ... అంటున్నారేమిటి?" ... గంగాధరం యింకా గుచ్చి అడుగుతున్నాడు.

"వాడి బొంద జాగ్రత్త. యిక వాడిమాట యెత్తకు. పంచ మహాపాపాలు చుట్టుకొంటయి. చెప్పు తీసుకొని ఆనాడే తన్నినట్లయితే యీ నాడు పీడాటలు యింతదాకా సాగి వుండక పోయేవిగా. పైగా దాంతో కూడా అనిపిస్తున్నాడు - వుత్తరాలు వ్రాయమని, వెళ్ళేటోజున చెప్పకపోతే నోట మాసుకోపోయాడా! ఎవడు చెప్పమని యేడిచాడు. దానికంతకన్నా సిగ్గూ యెగ్గూ లేకుండా మాట్లాడింది."

మల్లిఖార్జునరావుకి పేరుకున్న కక్కసంతా వెళ్ళగక్కేసాడు. హృదయంలో సగంభారం తగ్గినట్లైంది. చేసుకొన్న భర్తనుంచి భార్యను ఎడబాటు చేయడం - తన స్వార్థానికి వినియోగించుకోవడం - యిలాంటి పనులు చేసే, అందులో తండ్రి సామధేయం గల్గిన వాళ్ళుంటారనేది కళ్ళారా చూసిన తరవాత నమ్మాడు మల్లిఖార్జునరావు.

◆ ◆ ◆

దసరా సెలవులకు కోలవెన్ను వెళ్ళాడు మల్లిఖార్జునరావు. తిరిగి వచ్చేటప్పటికి ఆ వూరి వారే అతనికి క్రొత్తవారయ్యారు. ఎప్పుడూ చూస్తున్న మొగాలే కొంగ్రొత్త రూపాల్లో కనిపించసాగాయి. ఎప్పుడూ వింటున్న మాటలే చిత్రవిచిత్రంగా వినబడుతున్నాయి. ఏమిటిదంతా! ఎందుకీ సంత! ఎవరివల్ల తనకీరభస! గంగాధరం అరుగుమీద చేరే సభ్యులంతా కోరి కోరి తన మొగాన్ని చూస్తున్నట్టుగా వుంది. తాను యేంచేస్తున్నది కాపుకాసి, పొంచి చూస్తున్నట్లుగా వుండేది. తనేం మాట్లాడినా క్రొత్త అభిప్రాయాలైనట్లు, క్రొత్త చేష్టలతో వున్నట్లు, క్రొత్తజీవితంలోకి అడుగుపెట్టినట్లుగా వుండేది. "ఏమిటీ విపరీతం!" అని గంగాధరంతో ఒకనాడు ముచ్చటించాడు. గంగాధరం "సావధానంగా చెప్పాలా ఒకటి రెండు మాటల్లో తేల్చేస్తే బాగుంటుందా!" అని వూహించాడు. చెప్పదల్చుకొంది, సరిగ్గానే చెబుదాం. తప్పేముంది. మనస్సులో ఒకటి పెట్టుకొని, పెదవులమీదనుంచి మరొకటి జారవిడచడం తనికే అవమానమనిపించింది. గన్నవరంకి వచ్చేదార్లో ఒక తూంవుంటే అక్కడ సమావేశపరచి మల్లిఖార్జునరావుని, గంగాధరం సవిస్తరంగా — హృదయంలోకి చొచ్చుకుపోయేలాగు చెప్పాడు.

"తాను విడిచి వేయాలనే వుద్దేశ్యంతోనే సరోజినిని విడిచివేశాను — !"

చేసుకొన్న భార్యతో కాపురం చేయడం చేతకాక, పరాయి స్త్రీని చేరదీసి దాని కౌగిలింతల పారవశ్యంలో కులమతాలు భ్రష్టపరిచాను.

తాను బ్రహ్మాజీరావుని చీటికి – మాటికి వచ్చినప్పుడల్లా డబ్బు అడుగుతూ వచ్చాడా! -

సరోజిని పుట్టింటనంటే పిల్చితెచ్చుకోక ఒంటరి జీవితం గడపడంలోగల రహస్యమేమిటి? - !"

ఒక్కసారిగా సినిమారీల్సులాగా తిరిగినట్లున్నాయి. -

"గంగాధరం యేమిటీ విపరీతం. యీనాడు నా బ్రతుకు యిలా తెల్లవారింది. నిజంగా నా సంసారానికి బ్రహ్మాజీరావు నిప్పు పెట్టినవాడు కాదంటావా! నాసంసారపతనానికి అతను కారకుడు కాదంటావా! నువ్వైనా నిజం చెప్పు. అపవాదులు యింత బలంగా వుంటే, నేనేంచేసేది. ఎలా తలెత్తి తిరగను. నా సంగతి నీకు తెలియంది కాదుగా. యిన్నిఖండాలపు మాటలు సాగురించి లోకులు మాలకాకి మూకలాగా అపభ్రంశాలు కూస్తుంటే యేంచెయ్యమంటావ్.

మల్లిఖార్జునరావు కళ్లల్లో నీళ్లుతిరిగినయి. గుండె దడదడ అంత కంతకు యెక్కువైంది. కొంచెంసేపు యిద్దరూ మౌనంగా వుండిపోయి ప్రొద్దువాలుతున్న వేళలో యింటి ముఖం పట్టారు.

"గులాబి పువ్వుకి ముళ్ళున్నా ఆదరించడం జరుగుతుంది."

"తుమ్మపువ్వుకి ముళ్లున్నా ఆదరించడానికి మనస్సు వొప్పుకోదు.

"గులాబి పువ్వు వికసించి, మానవునికి ఆనందం కలిగించి, అతని కరకమలాల్లో ఆనంద పారవశ్యం పొందుతుంది. కవికుమారులు, కావ్యాలు వ్రాస్తారు. 'గులాబి' ని కోరే ప్రేయసీ ప్రియులు వుంటంవల్లనే అది మనకు కనబడుతూ నిత్యమూ, మనల్ని చూస్తూ వుంటుంది.

"తుమ్మ పువ్వు విచ్చిన'మరుక్షణమే తల్లిపాదలపై పడుతుంది.

కాని, రెండు భగవత్ దృష్టిలో ఒకటే. రెండిటిది పూల జాతే.

♦ ♦ ♦

"మానవజాతి ఒకటే" - "వారిగుణాలు వేరు" "ముళ్ళన్నీ ఒకటే జాతి"–వాటి "తీరు–చేష్టలు వేరు."

"మొగ్గలన్నీ వికసించవలసిన పూవులే. పూసిన పూలన్నీ వాడి, రాలిపోవుడం మామూలే. కాని, బ్రతికినన్నాళ్లు వేటి అందం అవి చూపుతూవుండటం వాటి బాధ్యత."

♦ ♦ ♦

బ్రహ్మాజీరావు వల్ల మల్లిఖార్జునరావుకి - సరోజినికి దూరం యేర్పడింగదా! -

బ్రహ్మాజీరావు స్థలం వల్ల అలివేలు మంగకి-! సత్యవతికి తగాదా వచ్చిందిగదా! –

బ్రహ్మాజీరావు వల్ల సుబ్బారావు - శోభనాచలపతి - రంగారావు మాట్లాడుకోరుగదా! -

బ్రహ్మాజీరావంటే సయాన రక్త సంబంధి అన్నగారైన శరభయ్య యిపుడున్న వుమ్మేస్తాడుగదా! -

ఇక బ్రహ్మాజీరావు వల్ల బాగుపడిందెవరు?

తుమ్మముళ్లు లాంటి బ్రహ్మాజీరావు, రావమ్మ, సత్యవతి, సరోజిని యింకా యిటువంటి ఘన కార్యాలు యెన్ని చేయదల్చుకొని వున్నారో! ముళ్లున్నయ్యని తెలిసికూడా మూర్ఖంగా పోతే నుప్పురాక మెప్పు యెలావస్తుంది. యీనాడు మల్లిఖార్జునరావుకి కాలుతీసి కాలుపెట్టినప్పుడల్లా బజారులో తుమ్మముళ్లు గుచ్చుకోకుండా యెలా వుంటయి. కంప దూరంగా వుంచినా ముళ్లెక్కడికి పోతయి.

## 18

ఒకనాడు ప్రసాదరావు మాచవరం వచ్చాడు. యీసారి రావమ్మ యింట్లో బసచేసాడు. సహా

జంగా ఆయనొచ్చాడంటే అందరిండ్ల వాళ్లకి అమిత మైన అనురాగం తలెత్తుతుంది. చాలా సంతోష పడతారు. పక్షపాతం చూపనివ్యక్తి యెప్పుడూ ప్రపంచంలో పేరు తెచ్చుకొంటూనే వుంటాడు. కాని మల్లిఖార్జునరావు సంగతి విన్ననాటినుంచి పూర్తిగా విషయం తెలిసినా, తప్పెవరిదో సూక్ష్మంగా యోచించి మనస్సులో వుంచుకొన్నాడు. తుమ్మచెట్టు తగాదా విన్ననాడుకూడా న్యాయం అనేది యెవరి ప్రక్కతూగిందో తెలుసుకొని హృదయపేటికలో దాచుకొన్నాడు.

"బ్రహ్మాజీరావు రాను రాను ప్రవర్తిస్తున్న ప్రవర్తననుబట్టి తన్నుదానూహించుకొన్నా ఆ సమస్యలన్నీ తెగని గొలుసులాగా తయారైంది. యిదంతా యేదో గ్రహమహత్యం కాకపోతే యేమిటని" ఆత్మను సమాధాన పరచడం జరుగుతోంది.

"నిజంగా బ్రహ్మాజీరావు ఒకప్పుడు చాలా తెలివితేటలుగలవాడు. మంచి గౌరవంకూడా సంపాదించుకొన్నాడు. ఎంతో వివేకంగలవాడు. మరి యీ నాటికి అతని జీవితం అపవాదుల పాలయిందంటే కర్మ కాకపోతే మరేమిటి? రామకోటివ్రాసి, హోమాలుచేసి సోమయాజులనిపించుకొన్న బ్రహ్మాజీ రావుకు చేకూరిన పుణ్యఫలం యిదేనా! యిటువంటి అమర్యాదపు కృత్యాలు చేయడానికేనా!"

ప్రసాదరావుకికూడా ఆనాడు బ్రహ్మాజీరావంటే హేయం జనించింది. "ఎంత చీదరించుకొన్నా సాటి వాడు కాకపోడుగా! - ప్రాణతుల్యుడు కాకపోడుగా!_"

సాయంత్రం చల్లగాలికి ప్రసాదరావు యీ ఆలోచనల్లోంచిలేచాడు కాలవగట్టుకి -

నేనూ విశ్రాంతికి అక్కడికేచేరాను. ఆయన కాత్మీయులలో ఒకన్ని కాబట్టి మందహాసంతో. "రారా-" అని పిల్చాడు. మెల్లగా చేరాను. చేరిన వాన్ని పల్కరించకుండా యెలా వుంటాను! కానేపు నా వుద్యోగ విశేషాలు, కుటుంబ విషయాలు పిచ్చాపాటిలో అంశాలుగ పెట్టుకొన్నాం. అన్నిటికీ ఆప్యాయంగానే జవాబిస్తూ వస్తుండగా - నేనే వూరుకోక_

"మామయ్యా! మల్లిఖార్జునరావు బ్రతుకు యిలా తెల్లవారిపోయిందేమిటి? అసలు మనవాళ్ల అభిప్రాయమేమిటి? యీ విషయంలో జరిగిన తప్పంతా బ్రహ్మాజీరావుదా? సరోజినిదా? మల్లిఖార్జున రావుదా? - ఎవరిది?"

"ఎవరిదని రూఢిగా చెప్పగలం!"

"మల్లిఖార్జునరావు సంసారం చెడిపోవడానికి ముఖ్యకారకుడు బ్రహ్మాజీరావే-" సుబ్బారావు యీ మాటని యెన్ని వందలసార్లైనా విసుగులేకుండా అనగలడు.

"తన సంసారాన్ని తనే చేతులారా చెడగొట్టుకొన్నాడు. ఒకళ్లనంటే యేంలాభం వూరికే!" రామమ్మ, సత్యవతి, తిండి తిప్పలు మానుకునైనా యీ వార్తని పదిమందికి వెళ్లడిచేయడానికి సాహసింపగలరు.

"ఇదంతా కర్మ కాకపోతే మరేమిటి చెప్పండి"- శోభనాచలపతి పర్యవసానంగా భావించి, తూచి యీ వాక్యాన్ని సమయానుకూలంగా వదలగలడు.

"ఎవర్నని యేంలాభంలేదు." అలివేలుమంగ తాయారమ్మ, ఎవరన్నా ఆ సంసారాన్నిగూర్చి అడిగితే చెప్పే మాట యిదొక్కటే. అదైనా స్థలాస్థల విచక్షణా జ్ఞానంతో.

"నాకెందుకీ గోలంతా. నాకేం చెప్పొద్దు. నేను వినలేను. యెవరికేం చెప్పడానికి నాకేం తెలియదు. ఎవరేడుపు వాళ్లేడుస్తారు. ఒకళ్లని గురించి మనకెందుకయినా!" రంగారావు ఉవాచ యింతకంటే యేమీలేదు.

అటువంటప్పుడు తప్పెవరిదని గట్టిగా చెప్పగలం? అయినంతవరకువిని విచారపడి సానుభూతి చూపడం తప్ప చేయగల్గినమేలుకూడా నాకేమీ కనిపించడం లేదు. ఒక్కటి మాత్రం తప్పుగా కనిపిస్తోంది. ఏమంటే? భర్తతో సహకరించవలసిన బాధ్యత భార్యకుంది. భార్యతో అనురాగంగా బ్రతుకవలసిన బాధ్యత భర్తకుంది. యీ బాధ్యతాయుతమైన భాగాన్ని మోయడానికి వంతులు కుదరబోవకుండొచ్చు. పక్షపాతం యిరువురిలోను నిండివుండి వుంటుంది. యీ కాలంలో స్త్రీకంటే పురుషుడే అధికుడని ఒక అభిప్రాయంకూడా వుందిగా! స్త్రీకి కూడా సంపూర్ణ స్వాతంత్రం కావాలని మహిళా సంస్థలు గర్జించుతున్నాయిగా. వీటి నాధారంచేసుకొని స్వేచ్ఛాయుతంగా సరోజిని ప్రవర్తించడంవల్ల మల్లిఖార్జునరావు యీ సందర్భంలో నిరసనచూపించి, నిలిపివేయడానికి ప్రయత్నించి వుండొచ్చు. సరోజిని, మల్లిఖార్జునరావు ప్రవేశపెట్టిన కట్టుబాట్లకు అలవడలేక, అలమటించి యెలాగైనా తప్పుకుపోదామని ప్రయత్నించి వుండొచ్చు. యిటువంటి పరిస్థితుల్లో బ్రహ్మాజీరావు బలం సరోజినివైపు మొగ్గడంవల్ల, మల్లిఖార్జునరావు బ్రతుకు బాట ప్రక్కన తుమ్మచెట్టు మొలిచి, కాలు కదిపినప్పుడల్లా తుమ్మముళ్లు గుచ్చుకొంటున్నాయి. ఆ బాధే చివరకు అతనికి మిగిలింది. యీ మిగలడంకూడా ఒక బాధే. బాధపడతామేమో అని ముందుగా జాగ్రత్తపడటంకూడా బాధే. యీ బాధకు కల్పించుకొంటే కారణాలు చాలా వుంటయి. బాధ అనుభవించేవాడికి కొన్నాళ్లికది పాతదైపోతుంది. క్రొత్త క్రొత్తగా కొందరికి తయారవుతూ వస్తుంది. కల్పించుకొనేవారి మనస్తత్వాల్నిబట్టి వుంటుందా రూపం.

ఇంతకీ ఎంత చెప్పుకున్నా మల్లిఖార్జునరావు సంసారం అనూ, అతని బ్రతుకే అనూ, మొత్తానికి చెడిపోయినట్లేగాలెక్క. బాగుపడకపోతుందంటావ్. అది మనం చెప్పలేనిమాట. వూహాకందని సమస్య. అతని జీవితం మళ్ళా చిలవల పలవలతో క్రొత్త రూపం దాల్చడం మనం చూడమేమో! ఒకవేళ చూస్తామేమో యెవరు చెప్పగలరు. "యీ మధ్య అతనిమీద చాలా అంభాండాలువేశారు. కాని అవన్నీ కల్పనలే అని గట్టిగా చెప్పాల్సిందే" అంటూ ప్రసాదరావు మల్లిఖార్జునరావు జీవితాన్ని సమీక్షించేటప్పటికి, బ్రహ్మాజీరావే అతని బ్రతుక్కి అంతరాయం కలిగించిన వ్యక్తి అని నాకు తోచింది.

"అంతా విన్నావ్. అందరన్న మాటలుకూడా విన్నావ్. మరి నువ్వేమంటావ్ అతని జీవితంపట్ల" అని ప్రసాదరావడిగే టప్పటికి జవాబుకోసం కొంచె మాలోచించి—

"అవును. కాళ్లకు చెప్పులుండటం చాలా మంచిది. మనం నడిచేదాట్లో ఒక్క ముళ్లేగాదు, పురుగు పుట్రా, రాయి రప్పాకూడా వుండొచ్చు. యెక్కడేముంటుందో అని ముందుగా వూహించి, నడకసాగించంగదా! కర్మంకాలితే తాడు పామై కరిచినా కరవచ్చు. అందుకని సాధ్యమైనంతవరకు కాలు కదిపేముందు అన్నీ జాగ్రత్తగాచూసి కదుపుతుండటం మంచిదని అనుకుంటున్నాను"అన్నా.

"అవును. నువ్వు చెప్పిందికూడా సబబుగానే వుంది. కాని, అంత జాగ్రత్త ఆ సమయంలో వుండొద్దూ. ఇంతకీ అదృష్టాదృష్టాలమీదవుంది యిదంతా" అన్నాడు ప్రసాదరావు.

ఇద్దరం కాల్వగట్టుమీదనుంచి లేస్తుండగానే తుమ్మల్లో ప్రొద్దుకూకబోతోంది. గోధూళివేళలో గృహోన్ముఖులమయ్యాం.

———

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

శ్రీ కల్లూరు అహోబలరావు

## ప్రథమాశ్వాసము

శ్రీ దేవతలకెల్ల - నాదిదేవుండవు
మూడు లోకములకు ముఖ్య గురుఁడ
వవనిజాతకు భర్త వాద్యుండవీవు, స
త్య వ్రతుండవు ; శాంతి తత్పరుఁడవు
కోటి చంద్రులమించు మేటికాంతినిఁగల్గు
ముఖమండలుండవు ; సఖుఁడవీవు !
కౌస్తుభమణితోడఁ గాంతి యుక్తుండవు
సకలార్థ సిద్ధుల సహితుఁడీవు !
పరగ, సరయూ నదీతీర వాసుఁడగుచు
భక్తకోటిని రక్షించు పావనుఁడవు ;
అమల రఘువంశ రాజుల నధికుఁడీవు !
ప్రాంజలి నొనర్తురామ ! నీ పాదములకు.

౨

అప్రమేయుండవు, దశరథాత్మజుఁడవు
పద్మనయనుండ వాజాను బాహు యుగ్ముఁ
డీవు ; సీతాపతివి ; రాక్షసేశకుల, వి
నాశ ! శ్రీరామ ! కొనుము నా నమస్సు.

౩

చిఱునవ్వుమోమునఁ జిందులాడెడివాఁడు
కరుణా సముద్రుఁడై గ్రాలువాఁడు
కర్ణకుండలములకాంతి, మెఱయువాఁడు
హరి నీల కేశంబుల మరువాఁడు
చెవుల పర్యంతంబుఁ జెలువుగన్నులవాఁడు
శ్యామల వర్ణ దేహంబువాఁడు
జానకీదేవితో సరసమాడెడివాఁడు
తామ్రాంబుజముల, పాదములవాఁడు
వాఁడు మా వాఁడు ; శ్రీరామవల్లభుండు
దేవతలలోన శ్రేష్ఠుఁడై దివ్యుఁడగుచు
మాదు కోర్కెల మన్నించు మాధవుండు
అట్టి శ్రీరాము సతతంబు నాశ్రయింతు.

౪

కౌసల్యావరపుత్ర - కాకుత్స్థవంశ !
భూసుత రంజనా ! భువనైకవీర !
నిర్మల సుమగాత్ర ! నిరుపమాకార !
ధర్మకార్యాసక్త ! దానవనాశ
జనముల దుష్పాప । సంచయధ్వంస
జనసుత శుభకర । పనుల నొనర్ప
నాసక్తుఁడై యుండు । నభిరామ ! రామ !
శ్రీ సఖా ! రఘుపతీ ! చిన్మయాకార !
వందనం బొనరించి । ప్రార్థింతు నిన్ను
సుందరాకార ! ప్రోచుకొనవే ! మమ్ము !

(సశేషము)

అటువంటప్పుడు తప్పెవరిదని గట్టిగా చెప్పగలం? అయినంతవరకువిని విచారపడి సానుభూతి చూపడం తప్ప చేయగల్గినమేలుకూడా నాకేమీ కనిపించడం లేదు. ఒక్కటి మాత్రం తప్పుగా కనిపిస్తోంది. ఏమంటే? భర్తతో సహకరించవలసిన బాధ్యత భార్యకుంది. భార్యతో అనురాగంగా బ్రతుకవలసిన బాధ్యత భర్తకుంది. యీ బాధ్యతాయుతమైన భారాన్ని మోయడానికి వంతులు కుదరకపోవకుండొచ్చు. పక్షపాతం యిరువురిలోను నిండివుండి వుంటుంది. యీ కాలంలో స్త్రీ కంటే పురుషుడే అధికుడని ఒక అభిప్రాయంకూడా వుందిగా! స్త్రీకి కూడా సంపూర్ణ స్వాతంత్రం కావాలని మహిళా సంస్థలు గర్జించుతున్నాయిగా. వీటి నాధారంచేసుకొని స్వేచ్ఛాయుతంగా సరోజిని ప్రవర్తించడంవల్ల మల్లిఖార్జునరావు యీ సందర్భంలో నిరసనచూపించి, నిలిపివేయడానికి ప్రయత్నించి వుండొచ్చు. సరోజిని, మల్లిఖార్జునరావు ప్రవేశపెట్టిన కట్టుబాట్లకు అలవడలేక, అలమటించి యెలాగైనా తప్పుకుపోదామని ప్రయత్నించి వుండొచ్చు. యిటువంటి పరిస్థితుల్లో బ్రహ్మజీరావు బలం సరోజినివైపు మొగ్గడంవల్ల, మల్లిఖార్జునరావు బ్రతుకు బాట ప్రక్కన తుమ్మచెటు మొలిచి, కాలు కదిపినప్పుడల్లా తుమ్మ ముళ్లు గుచ్చుకొంటున్నాయి. ఆ బాధే చివరకు అతనికి మిగిలింది. యీ మిగలడంకూడా ఒక బాధే. బాధపడతామేమో అని ముందుగా జాగ్రత్తపడటం కూడా బాధే. యీ బాధను కల్పించుకొంటే కారణాలు చాలా వుంటయి. బాధ అనుభవించేవాడికి కొన్నాళ్లకది పాతదైపోతుంది. క్రొత్త క్రొత్తగా కొందరకి తయారవుతూ వస్తుంది. కల్పించుకొనేవారి మనస్తత్వాల్నిబట్టి వుంటుందా రూపం.

ఇంతకీ ఎంత చెప్పుకున్నా మల్లిఖార్జునరావు సంసారం అనూ, అతని బ్రతుకే అనూ, మొత్తానికి చెడిపోయినట్లేగా రెళ్లు. బాగుపడకపోతుందంటావ్. అది మనం చెప్పలేనిమాట. వూహాకందని సమస్య. అతని జీవితం మళ్ళా చిలవల పలవలతో క్రొత్త రూపం దాల్చడం మనం చూడమేమో! ఒకవేళ చూస్తామేమో యెవరు చెప్పగలరు. "యీ మధ్య అతనిమీద చాలా అంకాండాలువేశారు. కాని అవన్నీ కల్పనలే అని గట్టిగా చెప్పాల్సిందే" అంటూ ప్రసాదరావు మల్లిఖార్జునరావు జీవితాన్ని సమీక్షించేటప్పటికి, బ్రహ్మజీరావే అతని బ్రతుక్కి అంతరాయం కలిగించిన వ్యక్తి అని నాకు తోచింది.

"అంతా విన్నావ్. అందరన్న మాటలుకూడా విన్నావ్. మరి నువ్వేమంటావ్ అతని జీవితంపట్ల" అని ప్రసాదరావడిగే టప్పటికి జవాబుకోసం కొంచెమాలోచించి—

"అవును. కాళ్లకు చెప్పులుండటం చాలా మంచిది. మనం నడిచేదార్లో ఒక్క ముళ్లేగాదు, పురుగు పుట్రా, రాయి రప్పాకూడా వుండొచ్చు. యెక్కడేముంటుందో అని ముందుగా వూహించి, నడకసాగించంగదా! కర్మంకాలితే కాడు పామై కరిచినా కరవచ్చు. అందుకని సాధ్యమైనంతవరకు కాలు కదిపేముందు అన్నీ జాగ్రత్తగాచూసి కదుపుతుండటం మంచిదని అనుకుంటున్నాను" అన్నా.

"అవును. నువ్వు చెప్పిందికూడా సబబుగానే వుంది. కాని, అంత జాగ్రత్త ఆ సమయంలో వుండొద్దూ. ఇంతకీ అదృష్టాదృష్టాలమీదవుంది యిదంతా" అన్నాడు ప్రసాదరావు.

ఇద్దరం కాల్వగట్టుమీదనుంచి లేస్తుండగానే తుమ్మల్లో ప్రొద్దుకూకబోతోంది. గోధూళివేళలో గృహోన్ముఖులమయ్యాం.

# బాబు

"శశి"

"సంజచీకట్లు అలముకుంటున్నవి. ఆవులు 'అంబా' అని అరుస్తూ, యిళ్లకు తిరిగి వస్తున్నవి. వాటి గిట్టల తాకిడికి రేగిన ఎఱ్ఱటిదుమ్ము, పరిసరాల్ని మరీ ఎఱుపుగా చేస్తున్నవి. పిట్టలు అరుస్తూ; తమ, తమ గూండ్లను జేరుకుంటున్నవి. గుడిగంటలు అస్పష్టంగా వినబడ్తున్నవి. పెద్దగా ధ్వనిచేస్తూ; వంతెన మీదుగా, రైలు వెళ్ళిపోయింది. ప్రక్క యింట్లోంచి జోలపాట సన్నగా వినబడ్తున్నది. మల్లెపూలు తమ సుగంధాన్ని గాలిలో వ్యాపింపచేసి, పరిసరాల్ని మత్తెక్కిస్తున్నాయి.

'బాబు' అలా శూన్యంలోకి చూస్తూ; చాలా సేపటినుంచీ; మల్లెతీగ ప్రక్కగానున్న, అరుగుమీద కూర్చునివున్నాడు. అతని చిన్నారి కళ్ళనిండా నీరు తొణికిసలాడుతుంది. ఆ చిన్నారి పాలబుగ్గల మీదుగా, ఒక్కొక్క కన్నీటి బొట్టు జారి; చొక్కామీదపడి; యింకిపోతున్నది. బాబు ఆ కన్నీటిని చొక్కాలో తుడుచుకోనైనా తుడుచుకోవటంల్లేదు. అతనివైపుచూచి ఏమీ అర్థంగాక వెళ్ళబోయి, మళ్లీ అక్కడే కూర్చుండిపోయింది తెల్ల పిల్లి పిల్ల. జుట్టురేగి నుదుటిమీదపడి; ఆ లేత వదనానికి క్రొత్తశోభ కూరుస్తుంది.

ఇంతలో బాబును వెదుకుతూ శారద అటువైపుగా వచ్చింది. వెనుకనుంచి బాబునుచూచి దగ్గరగావస్తూ "బాబూ! యిక్కడ చీకట్లో కూర్చున్నావా? లోపలికి వెళ్దాం రా" అని బాబు బుజంమీద చెయ్యివేసి, ముఖాన్ని తనవైపు త్రిప్పుకొని కన్నీటి తడిమిచూచి; "ఏడుస్తున్నావా బాబూ?" అని అడిగింది. "వదినా" అని బావురుమన్నాడు బాబు. బాబును హృదయానికి హత్తుకుంటూ "ఏడవకు బాబూ! రా! భోంచేద్దువుగాని" అని బాబును ఎత్తుకొని యింట్లోకి తీసుకువెళ్ళి పీటమీద కూర్చోబెట్టి; అన్నంకలిపి అతనిముందుపెట్టి తినమని శారద దొడ్లోకి వెళ్ళింది.

మళ్ళీ 5 నిముషాలకు లోపలికి వచ్చింది శారద. బాబు అలానే ఏడుస్తూ కూర్చుని వున్నాడు. "తొందరగా తిను బాబూ! మళ్ళీ మీ అన్నయ్య వస్తారు" అని హెచ్చరించింది. బాబు తలెత్తి, ఆమె ముఖంలోకి చూచాడు. ఆ విచారవదనాన్ని చూచేటప్పటికి, శారదకుకూడా దుఃఖం ఆగలేదు. కానీ ఆమె ఎలాగో ఆపుకొని, బాబు ప్రక్కన కూర్చుని; ఆమె ఒక్కొక్క ముద్ద బాబు నోట్లోపెట్టి తినిపించింది. తర్వాత పక్కవేసి బాబును పడుకోబెట్టి ఆమె వెళ్లబోయింది. బాబు ఆమె చెయ్యిపట్టుకొని, "వదినా నాకు భయంగావుంది. నీవుకూడా వుండవూ" అని దీనంగా అడిగాడు. శారద అతని ప్రక్క; బాబుమీద చెయ్యివేసి, చిచ్చికొడ్తూ కూర్చుంది. బాబు కాస్సేపటికల్లా నిద్రపోయాడు.

శారద కక్కడినుంచి, వెళ్ళబుద్ధిపుట్టలేదు. దీపం సన్నగా వెలుగుతుంది. దాని చుట్టూ రెండు పురుగులు ఎగురుతున్నాయి. శారదకు గడచిన రోజులన్నీ గుర్తుకు వస్తున్నవి.

♦ ♦ ♦

శారద కాపురానికి రాకముందే, ఆమె మామగారు మరణించారు. అప్పటికి బాబు రెండేండ్లవాడు. అప్పటినుంచీ ఆమె భర్త రఘు కుటుంబ వ్యవహారాలు చూస్తూ వచ్చాడు. ఆమె అత్త 'సుందరమ్మ' వట్టి అమాయకురాలు. ఆమె శారద కాపరానికొచ్చిన క్రొత్తలో ఏపనీ చేయనీక, తనే అన్ని పనులూ చేసేది. కానీ శారదే తనుకూడా కొన్ని కొన్ని పనులలో అత్తగారికి తోడ్పడుతుండేది. శారద కప్పుడు తనంత అదృష్టవంతురాలెవ్వరూ లేరనే భావనవచ్చేది. ఏమంటే. అనుకూలుడైన భర్త. కష్టసుఖా లెరిగిన అత్త. తక్కిన విషయాలలో ఏమీ లోటులేదు. కాలం హాయిగా, సుఖంగా గడిచిపోతున్నది. 15 రోజుల క్రితం సుందరమ్మ ఉబ్బస వ్యాధితో మరణించింది. చనిపోయేముందు "బాబును

జాగ్రత్తగా చూడమని మరీ, మరీ చెప్తూ; తనచేత ఒట్టు వేయించుకొని" తృప్తిగా కళ్లు మూసింది.

కానీ బాబు వాళ్ళమ్మకోసం ఒకటే ఏడుపు. మొదట్లో "ఆమె ఎక్కడికో వెళ్లిందని, మళ్లీ వస్తుందని" శారద బాబుకు చెప్పింది. బాబు 4 రోజులు ఊరుకున్నాడు తర్వాత మళ్ళీ మొదలెట్టాడు ఏడుపు. ఇక గత్యంతరంలేక "వాళ్ళమ్మను ఒక భూతం ఆకాశంలోకి ఎత్తుకుపోయిందనీ, బాబు కనుక ఏడిస్తే బాబును ఆ భూతం కొడ్తుందని" భయపెట్టింది శారద. కానీ బాబు ఏడుపు మానలేదు. రఘు 3 రోజులక్రితం విసుగెత్తి; "బాబు కనుక ఏడిస్తే కొట్తానని" గట్టిగా మందలించాడు. అప్పట్నుంచి బాబు పెరట్లో మల్లెతీగ ప్రక్క అరుగుమీద కూర్చుని; ఆకాశంలోకి చూస్తూ తనలో తాను ఏడుస్తుండేవాడు.

♦ ♦ ♦

ఆమె ఆలోచనలకు అంతరాయంగా రఘు వచ్చాడు. అతనికి భోజనంపెట్టి; తను భోజనం చేసి; బాబు దగ్గరకి వచ్చింది. అమాయకంగా నిద్ర పోతున్నాడు బాబు. దుప్పటికప్పి ఆమె వెళ్ళి పోయింది.

ఆ మర్నాడు బాబుకు జ్వరం వచ్చింది. ఆ సంగతి శారద రఘుకు చెప్పింది. ఏమీ ఆందోళన కనబరచకుండా; "అదే పోతుందిలే! ఆచార్యులి గారిదగ్గర్నుంచి, ఏవన్నా మాత్రలు తెస్తానులే" అన్నాడు. ఆ రోజు తొందరగా పనులన్నీ ముగించుకొని; బాబు దగ్గర కూర్చుని విసురుతుంది. బాబు "అమ్మా! అమ్మా" అంటూ ఒకటే ఏడుస్తున్నాడు. ఆ రోజు సాయంత్రం రఘు ఏవో మాత్రలు తెచ్చివేసాడు. దీపాలవేళకి బాబు ఒళ్లు వేడి కొద్దిగా తగ్గింది.

ఆ రోజుకూడా రఘు బలవంతంమీద బాబును మేడమీద ప్రక్కగదిలోనే పడుకోబెట్టింది.

ఆ రాత్రి బాబుకు భయంకరమైన కల వచ్చింది. ఆ కలలో బాబుకు వాళ్లమ్మ కనిపించింది. బాబును దగ్గరకు రమ్మని చేతులు చాచింది. బాబు ఎంతో సంతోషంతో అమ్మ దగ్గరకు పరుగెత్తుకుంటూ వెళ్తున్నాడు. ఇంతలో వాళ్ళమ్మను ఏదో పొగ ఆవరించింది. బాబు ఒక్క క్షణం ఆగిపోయాడు. పొగ పోయింది. బాబు మళ్లీ పరుగుతీసాడు. కానీ ఎవరో పెద్దతల; పొడుగు చేతులు; కాళ్లు; 4 గుమ్మడికాయలంతపొట్ట; నారింజకాయలంత రెండు ఎఱ్ఱటి కళ్లూ కలిగిన ఒకడు; భూతం కాబోలు అమ్మను గట్టిగ పట్టుకున్నాడు. అమ్మ కెవ్వున కేకవేసింది బాబు ఇంకా తొందరగా పరుగెత్తటం మొదలు పెట్టాడు. కాని భూతం వాళ్లమ్మను దూర దూరంగా తీసుకువెళ్తున్నాడు. కాస్సేపటికల్లా వాళ్ళిద్దరూ కనబడకుండా మాయమైపోయారు.

కెవ్వున కేకవేసి బాబు లేచాడు. చుట్టూ చీకటి. "వదినా" అని పిలిచాడు. జవాబులేదు. బాబుకు ఏడుపు వచ్చింది. ఇంతలో బాబుకు దాహమేసింది. నెమ్మదిగా పక్కమీదనుంచిలేచి, చీకట్లో తడుముకుంటూలేచి, ఎలాగో తంటాలుపడి బయటకు వచ్చాడు. అక్కడకూడా చీకటే! అలాగే తడుముకుంటూ ముందుకు వెళ్తున్నాడు. హఠాత్తుగా కాలు జారింది. "వదినా" అని అరచి ముందుకు మెట్లమీదుగా దొర్లిపోయాడు బాబు.

బాబు కేకకు శారద వులిక్కిపడిలేచి లైటు తీసుకొని తలుపుతీసి బాబు గదిలోకి వెళ్లింది. అక్కడ పక్క ఖాళీగావుంది. 'బాబూ' అని పిలుస్తూ గాభరాగా బైటకువచ్చి మెట్లమీదనుంచి క్రిందకు చూచింది. మెట్లక్రింద బాబు నెత్తురు మడుగులో పడివుండటం ఆమెకు కనిపించింది. "ఏమండీ" అని గట్టిగా రఘును పిలిచి తడబడ్తున్న కాళ్ళతో మెట్లు దిగి బాబు దగ్గరకు వెళ్లింది. బాబు అప్పటికే వాళ్ళమ్మను చేరుకున్నాడు.

రఘు శారద కేకకులేచి ఆవులిస్తూ "శారదా" అని పిలుస్తూ బైటకువచ్చి మెట్లక్రింద "బాబుమీద పడి శారద ఏడవటంచూచి" నిశ్చేష్టుడైపోయాడు రఘు."

---

(88 పేజి తరువాయి)

రామం "ఏదీ! యిలాతే" అని రిజిష్టరుచూసి "ఓరీ శుంఠాయి! ప్యాసయూడుట పాసు. ఎక్కడ ప్యాసయూవురా! బాగా చూశావా రిజిష్టరు" అన్నాడు. నేను విస్తుపోయాను. "అయితే మరి యూనివర్సిటీ నుండివచ్చిన లెటరు" అన్నాను ఆవేశంతో.

"ఏదీ? లెటరు" అన్నాడు రామం.

"అది డాక్టరు దగ్గఅనే! వుండిపోయింది" అన్నాను ,సంధిగ్ధావస్థలోపడి.

"బలేకోశారా నీకు మంచి లేతసొరకాయలు" అని రామం వెళ్ళాడు నవ్వుతూ.

తర్వాత తెలిసింది, ఆ రోజు డాక్టరు నా ఆరోగ్యంకోసం అలా నాటకమాడించేడని. శలవ్.

# ఊరిపంపు ముచ్చటలు

శ్రీ ఇనుకపల్లి దక్షిణామూర్తి



అనగా అనగా ఒకమంచి నీళ్ళపంపు.
ఆ పంపులోనుంచి మంచి నీళ్లు వస్తాయి.
పంపుక్రింద ఒకగట్టు.
ఆ గట్టుకు అన్ని పక్కలా ఖాళీ బిందెలు.
ఒక్కొక్కచోట ఒకదానిమీద ఒకటి చొప్పున వుంటాయి.
ఆ రోజు నీళ్లు విడిచిపెట్టటం ఆలస్యమయింది.
బిందెల్ని వదిలిపెట్టి మళ్ళీ వద్దామని మహిళలంతా నీడలోకిచేరారు.

నీళ్లు వస్తున్నాయి.
ఆడవాళ్లు పరుగెత్తుకు వస్తున్నారు
'ఏయ్, ఎవరు నువ్వు కళ్లు కనపడటంలా...'

'కనపడుతుంటే ఎవరు నువ్వు అని ఎందుకు అడుగుతారు,..'

జవాబు కొంచెం ఆలస్యంగా వస్తుంది.
'నాకు కనపడుతునే వున్నాయి ... నాకేం కళ్లు పోలా నీకు మాదిరి మంచి నీళ్లు తాగే బిందని తన్నుకుంటూ పోవటానికి...'

'నీ బిందని నాకేం తెలుసు...'

'యింకోళ్లదయితే తంతావా...'

'అది యింకోళ్లు అడగాలసిన ప్రశ్న...'

కొంచెం విరామం - బిందెల చప్పుడు, గాజుల చప్పుడు అంతకంటె దగ్గరగా వినపడుతుంది.

'బింద నిండకుండానే లాగేస్తున్నావే, యిదేం సర్కారీ సొమ్మనుకొని నీ తాత సొమ్మను కున్నావా...'

'నా తాత సొమ్మంటే యిక్కడికెందుకొస్తాను, తేరగా వచ్చిందిగదా అని బింద నిండిపోయి పొర్లిపోతున్నా చూస్తూ పూరుకోమంటావా...'

'బోడి పెత్తనం...'
'ఎవరు బోడో అందరికీ తెలుసు...'

బింద ఖంగుమని పైకిలేచినప్పుడు, చళుక్కుమని నీళ్లుగచ్చుమీదపడ్డ శబ్దం.

'ఆవిడ తర్వాత నేనూ వచ్చింది, మెనగత్తెలాగా బింద పెట్టేస్తున్నావే, తీసేయి అక్కడినుంచి...'

'ఒకసారి పెట్టిన తర్వాత తీసెయ్యటానికి నేనేం ఆవిడలాంటి మనిషినిగాను - తెలుసునా...'

'ఓశమ్మో ... నీ లాంటివాళ్లని చాలామందిని చూశాను...బింద పెట్టునేనూ చూస్తానుగా...'

'దాన్ని పట్టుకోనియ్యవే, పక్కన మొగాళ్లు నవ్వుతున్నారు...'

'వీళ్ల జిమ్మడగ, ఎప్పుడు చూసినా నీడలో నిలబడి వెధవ నవ్వులే, కొంపకి తగులడరాదూ...'

'దగ్గరగా అనమోక తగాదాకి వస్తారు...'

'పంపు నీళ్లు అట్లా వట్టినే కారిపోతుంటే ఎవరో వకరు పట్టుకోరాదుటర్రా...'

'మడిగట్టుకున్నానేవ్, మీద నీళ్లుపడితే మీదపడి నలిచేసి మళ్లా మడిగట్టుకుంటా ఏమను కున్నారో...'

♦ ♦ ♦

'ఏమత్తా, మీ అమ్మాయికి మనువు కుదిరిందా...'
'ఈ చచ్చినాళ్లకి కట్నాలు కావాలిగదా, ఏడ నుంచి తెచ్చిపోసేది...'

'మరి చోద్యం...కట్నం తీసుకుంటే ఏంతప్పమ్మా ... పెళ్లాన్ని పిల్లల్ని చచ్చేటంతవరకూ పోషించ టంలా...'

'సీతూ మొగపిల్లలతో పాటు ఒక్క ఆడపిల్ల యినావుంటే తెలిసేది, నీతులు చెప్పటానికేం...'

'మాటలు తిన్నగా రానివ్వమ్మాయి...మూలావు సాగతీస్తున్నావే...సాగతీయటం అనీ, ఊ ...'

'అక్కడ ఆ కుండెవళ్ళే పెట్టింది, అయ్యో నా మతిపోనూ, రావద్దనుకుంటూనే యిక్కడికియిదొ తాను. అనుకున్నంతా అవుతునే వుంటుంది...'

'బామ్మగారూ ... నాదేనండి...'

'మూలపుటకపుట్టావు ... సిగ్గులేదుటే మడి ! గట్టుకువస్తే అక్కడ పెటతావుటే...ఆ...'

'బిగ్గరగా అనకండి మామ్మగారు, ఈ రోజుల్లో అంటే జైల్లో పెటతారు...'

'అయ్యో దేవుడా, ఎంత అదురుబాటుకాలం వచ్చిందిరా నాయనా...'

గట్టుమీద పంపులోనుంచి నీళ్లురావటం ఆగిపోయినాయి. పంపు అందరిచేతిలోపడి అటూ యిటూ వూగింది.

ఇంకా నిండని కుండలు ఖాళీగానేవున్నాయి. పంపు నీళ్లు రాకపోయినా నిలబడేవుంది. నీళ్లు రావటంవలన పంపు నిలబడిందనుకున్నవాళ్లు వాళ్ల చేకాళ్లని ముక్కుమీద వేశేసుకున్నారు.

"ఒరే భద్రీ! నేను చెప్పిన నోట్సు వ్రాసుకున్న పుస్తకం తీసికొనిరా"

"అదేమిటిసార్! - మీరు ఏరోజు నోట్సు ఆరోజు చదివి పారెయ్యమన్నారుగా"

అల్లంకి చెల్లాయ్

◆ ◆ ◆

"రాత్రి అంతా మా అమ్మ, నాన్న కలలో కనుపించారండీ-ఎలాగున్నారో ఏమో పాపం! ఒకమారు వెళ్లిచూచి రావాలనియుంది"

"రాత్రి అంతా వాళ్లను చూచావు కదా చాలదూ!"

◆ ◆ ◆

తల్లి కుమార్తెతో "సీతా! ఆముదం త్రాగుతావా! లేక చంపెయ్యమన్నావా" అని బెదిరించింది.

"నేనెలాగూ చావబోతున్నాను కదా!-యింక ఆముదమెందుకమ్మా!"

యం. వి. రమణమ్మ.

# ఇండియా గత సంవత్సరంలో సాధించిన అభివృద్ధి



ఇండియా ప్రభుత్వం గత సంవత్సరంలో స్వదేశంలోనేమి, విదేశాంగ విధానంలోనేమి సాధించిన విజయాలను ఈ 6-వ రిపబ్లిక్ దినోత్సవ సందర్భాన మనం సగర్వంగా సమీక్షించుకోవచ్చును.

అంతర్జాతీయ రంగంలో ఇండియా చేసిన కృషివల్ల వైమనస్య వైరస్యాలు చాలవరకు తగ్గిపోయాయి. అనేక దేశాల ప్రభుత్వాలు పంచశీలను అమోదించాయి. ఈ విధంగా ప్రపంచ దృష్టిలో ఇండియా పేరు ప్రతిష్టలు యినుమడించాయి.

అంతేకాకుండా ఇండియా ఆర్థికవ్యవస్థ కూడా గత సంవత్సరం అపారంగా అభివృద్ధిచెందింది. అనేక విషయాలలో ఇండియా స్వయంపోషకత్వాన్ని సాధించింది. ఇంజనీరింగు పరిశ్రమ దినదినాభివృద్ధి చెందుతూ వచ్చింది. భారీపరిశ్రమల విషయంలో స్వయం పోషకత్వం సాధనకై కృషిజరుగుతోంది. ఇండియాలో ఇప్పుడు రైలు ఇంజన్లు, నౌకలు, మోటార్లు, సైకిళ్లు, కుట్టు యంత్రాలు, యంత్రపరికరాలు మొదలైనవి ఉత్పత్తిచేయబడుతున్నాయి. ప్రభుత్వం స్వయంగా రైలు ఇంజన్లు, ఎరువులు, యంత్రపరికరాలు మొదలైన వస్తువుల ఉత్పత్తిని ప్రారంభించడమేకాకుండా ప్రైవేటు రంగంలోకూడా పరిశ్రమలను అభివృద్ధికి దోహదంచేసింది. పెరంబూరులోని ఇంటెగ్రల్ రైలుపెట్టెల ఫాక్టరీ, బెంగుళూరులోని హిందూస్థాన్ యంత్రపరికరాల ఫాక్టరీలు ఇండియా ప్రభుత్వం పారిశ్రామిక రంగంలో చేస్తున్న కృషికి నిదర్శనాలు. రూర్కేలాలో, దుర్గాపూర్, భిలాయ్ లలో 3 ఉక్కు కార్ఖానాలను నెలకొల్పడానికి పథకాలు వేయబడ్డాయి.

ప్రభుత్వ పరిశ్రమలు శీఘ్రంగా అభివృద్ధిచెందుతున్నాయి. చిత్తరంజను రైలు ఇంజను యంత్రాగారంలో ఏడాదికి 120 రైలు ఇంజన్లు ఉత్పత్తిచేయాలని ఉద్దేశించబడింది. ఇప్పుడు ఈ ఫాక్టరీ ఈ లక్ష్యాన్ని అధిగమించింది. ఇదే విధంగా సింధ్రీ ఎరువుల ఫాక్టరీలోకూడా ఉత్పత్తి అభివృద్ధి అయింది. కుటీర పరిశ్రమల నిర్మాణం విషయంలో సైతం ప్రభుత్వం ఎంతో శ్రద్ధవహించి వాటి అభివృద్ధి నిమిత్తం కృషిచేస్తోంది.

### ఆహారం, వ్యవసాయం

గడచిన కొలది సంవత్సరాలలో ఆహార వ్యవసాయపరిస్థితి ఎంతో అభివృద్ధి అయింది. 1955-56-వ సంవత్సరంనాటికి సాధించవలసిన లక్ష్యాన్ని ప్రణాళిక తృతీయ సంవత్సరంలోనే సాధించడమైంది. 1949-50-లో 5 కోట్ల టన్నుల ఆహార ధాన్యాలు ఉత్పత్తికాగా, 1954-55-లో

6 కోట్ల 53 లక్షల ధాన్యాలు ఉత్పత్తి అయాయి. అంటే 1954-55 నాటికి నిర్ణయించిన లక్ష్యంకంటే 42 లక్షల టన్నులు అధికంగా ఉత్పత్తిచేయబడింది. యిక పంచదార ఉత్పత్తి 16 లక్షల టన్నుల అపూర్వ పరిమాణాన్ని అందుకొన్నది. ఎన్నో బంజరు భూములను సాగులోకి తేవడమైంది. ప్రశస్తమైన వ్యవసాయ విధానాలు అమలుజరుపబడ్డాయి. యంత్రాలు, ఎరువులు, మేలిరకం విత్తనాలు ఉపయోగించబడుతున్నాయి. పెద్దరకం ప్రాజెక్టులు, చిన్నరకం ప్రాజెక్టులు ఎన్నో అమలు జరుపబడుతున్నాయి. 1955-లో అనేక ముఖ్యమైన భూమి సంస్కరణలను ప్రవేశపెట్టారు.

### విద్యుత్తు, సాగు సౌకర్యాలు

1955-లో అనేక బహుళార్థసాధకమైన ప్రాజెక్టులు వరద నివారణ ప్రాజెక్టులు ప్రారంభించబడ్డాయి. కోసీప్రాజెక్టు, నాగార్జున సాగర్ ప్రాజెక్టు యిందుకు ఉదాహరణలు. కోసీప్రాజెక్టు ఎంతో ముఖ్యమైన వరద నివారణ ప్రాజెక్టు. ఈ ప్రాజెక్టు నిర్మాణంలో ప్రజల సహకారం విరివిగా లభించింది. ఈ సంవత్సరంలోనే గంగువాల్ విద్యుత్తుత్పాదన యంత్రాగారం నిర్మాణం పూర్తిచేయబడింది. భక్రా ఆనకట్టస్థలంవద్ద ప్రధాన మంత్రి భక్రా నంగల్ ప్రాజెక్టుకు ప్రారంభోత్సవం జరిపారు. దామోదరలోయలో కోనార్ ఆనకట్టు, దుర్గాపూర్ ఆనకట్టలు తెరువబడ్డాయి.

### సాంఘిక సంక్షేమం

వీటన్నిటికితోడు గత సంవత్సరంలో ఆరోగ్య విద్యాభివృద్ధి పథకాలు అనేకం నిర్వహించబడ్డాయి. సాంఘిక సంక్షేమ పథకాలవల్ల గ్రామ ప్రాంతాలలో అపూర్వమైన అభ్యుదయం కలిగింది. సమాజాభివృద్ధి కార్యక్రమాలు చిన్న గ్రామాలకు విస్తరింపజేయబడ్డాయి. గ్రామీణాభివృద్ధి కార్యక్రమాల నిర్వహణలో ప్రజలు స్వచ్ఛందంగా ఎంతో స్నేహ సహాయాలు చేస్తూవచ్చారు. ఆర్థికాభివృద్ధితోపాటు సాంస్కృతిక వికాసం కూడా కానవస్తోంది. అనేక విదేశాలకు సాంస్కృతిక ప్రతినిధి వర్గాలను పంపడం వల్లనూ, అనేక విదేశాలనుంచి సాంస్కృతిక ప్రతినిధి వర్గాలు స్వదేశానికిరావడము వల్లనూ, ఇండియాకు విదేశాలకు మధ్య సాంస్కృతిక సంబంధాలు అపారంగా అభివృద్ధిచెందాయి. సంగీత నృత్య నాటక రంగాలలో బహుమతులు పోటీలు ఏర్పాటుచేయడంవల్ల కళలు అభివృద్ధిచెందాయి. జానపద సంగీతాలు, నృత్యాలు జనాదరణపొంది తిరిగి మన్ననస్థానాన్ని అలంకరించాయి.

ప్రథమ పంచవర్ష ప్రణాళిక ముగియవస్తున్న ఈ తరుణంలో భావిభారత సౌధ నిర్మాణానికి పునాదులు వేయడం పూర్తి అయిందనే చెప్పవచ్చును.

# పల్నాటి వీర చరిత్ర

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

---

(గతసంచిక తరువాయి)

ఈ కథలో మహాభారతంయొక్క అనుకరణాలు కొన్ని ఉన్నాయి. ధర్మరాజు దుర్యోధనుడితో జూదమాడి ఓడిపోయి అరణ్యాల పాలయ్యేడు. అట్టే మలిదేవరాజు నలగామరాజుతో కోడి పందెములాడి ఓడిపోయి, వనవాసం చేసేడు. వనవాసం నుండి తిరిగివచ్చిన తర్వాత ధర్మరాజుకి దుర్యోధనుడు అర్ధరాజ్యమీయనట్లే, మలిదేవరాజుకి నలగామరాజుకూడ రాజ్యమీయలేదు. అట్టి సమాన ఘట్టాలవల్ల ఈ కథకి పల్నాటి భారతం అని, బ్రహ్మనాయుడికి పలనాటి కృష్ణుడని పేర్లు వచ్చేయి.

## కథా విశేషాలు

శ్రీనాథుడు పల్నాటి వీరచరిత్రను చక్కని కళాఖండంగా సృష్టించదలంచుకొన్నాడు. అతను వీరరసమున్న భాగాన్ని మట్టుకే ఎత్తుకొన్నాడు. యదార్థాంశాలను వర్ణించడమేకాకుండ, రసోత్పత్తికిగాను కొన్ని విచిత్రాలనుగూడ కల్పించేడు.

జంగంకథ లన్నిటిలోను వీరరసం ప్రధానమని భావించవచ్చు. ఈ గ్రంథంలో అది మొదటినుండి చివరదాక ఉంది. అలరాజు మరణాన్ని తడుముతు కథ ప్రారంభమయింది. రాయబారాలకు వచ్చిన వారు శౌర్యాదులను వర్ణించేరు. సభలలోని యుద్ధ ప్రసంగాలు ఉత్తేజకరంగా ఉన్నాయి. ఐతాంబ తన కుమారుడికిచ్చే, వీరదీవన 'సురసాధు విభవంబు' ఇత్యాది చరణాలు అద్భుతంగా ఉన్నాయి. ఎక్కడ మాసినా వీరుల ఘనతే! సంధికార్యానికి వెళ్లిన భట్టు పేరు రణభట్టు. మాంచాల తన అత్తతో, 'బాలచంద్రుణ్ణి యుద్ధానికి పంపించు' అను మాట విద్యుత్తులాగు పనిచేసింది.

వీరరసానికితోడు భయానకరసం, భేతాళుడులు వర్ణించబడ్డారు. కన్నమనీడు ఎరుకలసానితో వాదించేడు. అట్లే రణరంగంలో బ్రహ్మనాయుడు నిల్చుని దేవుణ్ణి ప్రార్థించి వర్షం కురిపించేడు. కథ ముగిసేటప్పుడుకూడ భేతాళాదులు భయంకరంగా వర్ణించబడ్డారు.

కథ నిండుగా చక్కనైన ఘట్టాలెన్నో ఉన్నాయి. కన్నమదాసు, గండుకన్నమనీడు, బాలచంద్రుడు, రేఖాంబ, ఐతంబ ఘట్టాలు ఇత్యాదులు కథను ఆకర్షవంతంగా చేస్తున్నాయి.

బాలచంద్రుడు మాంచాలను కలుసుకొన్న ఘట్టం తెలుగువాఙ్మయంలో అద్భుతమైనది. అనపోతు ఉపాఖ్యానం ఈ గ్రంథానికి మెరుగుపెడుతూంది.

ఈ కావ్యంలో హాస్యరసం చిత్రంగా ప్రవేశపెట్టబడింది. మాంచాల బాలచంద్రుడి రూపం ఎరగదు. అతను, తమ్ములతోకూడ వచ్చేడు. బాలచంద్రుడు, అనపోతు కూర్చుని ఉండగా మాంచాల తన భర్త అనుకొని అనపోతు కాళ్లు కడగబోయింది. ఆమె తడబాటును అనుపోతు హాస్యంతో సవరించేడు.

దీనిలో చక్కనివర్ణనలు, సంభాషణలున్నాయి. మాంచాల ఆకారాన్ని వర్ణించడానికి షుమారు నూరు చరణాలు పట్టింది. ఆమె చక్కదనాన్ని అద్భుతంగా రెండే మాటలలో ఇట్లు చెప్పేడు.

భూదేవి తన రూపు పొలతినిచేసి
బాలుని భ్రమియింప బంపెనో యనగ
(78)

మార్లోకవి ఇంగ్లీషులో హెలెన్ సౌందర్యాన్ని వర్ణిస్తూ 'వేయిపడవలమీద యుద్ధానికి రప్పించిన ముఖం ఇదా!' అన్నాడు. ఇట్టి వాక్యాలు ఉదాత్త కవిత్వానికి నిదర్శనాలు.

రేఖాంబ, మాంచాల కిచ్చిన ఉపదేశం (76) షేక్స్పియరు మహాకవి వ్రాతలతో తులతూగుతూంది. నలగామరాజుకి భట్టుచెప్పిన నీతి విశేషాలు చాల బాగున్నాయి (19.21).

అద్భుతం, సంగీతం, నృత్యం, రాజసభ, సైన్యం మొదలైన వర్ణనలు బోలెడున్నాయి. మాంచాల బాలచంద్రుల ఘట్టంలోని సంభాషణలు చాల చక్కగా ఉన్నాయి.

ఈ కవి ఆంధ్రవాఙ్మయానికి కొన్ని కొత్త పాత్రలను అందించేడు. వాటిలో నాయకురాలైన నాగమ్మ ఒకర్తె. ఈమె సాహసం మెచ్చుకోదగి ఉంది. కాని ఆమె దుర్మార్గపుబుద్ధివల్ల మహాభారతంలో శకునిలాగు తన రాజును నాశనంచేసుకొంది. బాలచంద్రుడు, బ్రహ్మనాయుడు, అనపోతు, మాంచాల మొదలైన పాత్రలు ఆంధ్ర వాఙ్మయాకాశంలో తారలు.

## శైలి మొదలైనవి

ఈ కథ అభ్యుదయ గ్రాంధిక భాషలో మంజరీ ద్విపదలో రచించబడింది. ఏచరణానికి ఆచరణంలోనే మాటలు తెగిపోతాయి. రెండో చరణానికి పాకవు. అనగా Run on lines లేవని చెప్పవచ్చు. ఇట్లుండడం వల్ల పాడుకోడానికి సులువుగాను, వినడానికి హాయిగాను ఉంది.

కొన్ని కొన్ని చోట్ల సంస్కృతపదాలు విస్తారంగా ఉన్నాయి. కాని అవి ప్రధానంగా రాజుల బిరుదులకు సంబంధించినవి. చిన్నరాజులకు బిరుదులు పెద్దవికదా! దీనిలోని తెలుగు సులుగావు బోధపడుతుంది.

మహా విమర్శకులైన వేకుమళ్ల అచ్యుతరావుగారు శ్రీనాథుని కవితనుగురించి "ఈతనిది ఎప్పుడును ఉపన్యాస శైలి. సున్నిత భావాలను చిత్రించలేడనియు చెప్పవచ్చును" అనేవారు. ఆ వాక్యాలు అతని ప్రబంధాలనుగురించి మాత్రమే. ఈ జంగం కథలో వేరుగా ఉంది. సున్నిత భావాలు, స్పందనలు వర్ణించబడ్డాయి.

ఈ కావ్యంలో అనేక అనుభవోక్తులు (Aphonisms) కనబడతాయి. మచ్చుకి —

శూరుని తల్లికి సుఖమేమిలేదు (59)
శస్త్రధారులకెల్ల సమరంబుకూడు (61)
సామ్రాజ్య తరులెండి చచ్చెదునపుడు
శ్రీ వీర రక్తంబు చిగిరింపజేయు.
రాజసేవకులకు రణమే సుఖంబు.
సాహసల్ మూర్ఖులు సఖియలెల్లైర.
మాటమంచిది కాని మనసుకత్తెరయె.

మొదలైనవి చాల కనబడతాయి.

ఆ కాలంలో ఎడ్లకు పెట్టేపేళ్లు (7) వర్ణించబడ్డాయి. అప్పటి చిత్రకళ కొంతచెప్పబడింది—

శ్రీ రామ కథలును, శ్రీ కృష్ణకథలు
పన్నుగా వ్రాసిన పటముల దెచ్చి
కట్టిరిగోడలు కనపడకుండ (16)
ఘనచిత్ర కర్మ సంకలిత పటాలి
గోడలు కనరాక గుత్తమానట్లు (71)

ఆయా పట్టులలో నృత్యం (18), సంగీతం వర్ణించబడ్డాయి.

ఈ కథలో వీర శైవానికి, వీరవైష్ణవానికి ఉన్న ప్రాత్తు చక్కగా విశదపరచబడింది. బ్రహ్మనాయుడు మత సంస్కర్త. అతను మాల

వాడైన కన్నమనీడికి వైష్ణవమతమిచ్చి తన పెద్ద కొడుకుగా భావించుకొన్నాడు. వీరశైవులను, వీర వైష్ణవులను, ఒక్కరీతిగా చూసేదు, కాబట్టే అతన్ని ఈ నాటికీకూడ దేవుడిగా ఆరాధిస్తున్నారు. అదొక పెద్ద జాతర! పల్నాటి వీరుల కీర్తి చిరస్థాయిగా ఉంది.

ఈ పుస్తకానికి దేశ పటమున్నట్టయితే ఆయాస్థలాల విశ్లేషం చక్కగా తెలిసేది. ఉమాకాంతం గారి టీక చాల ఉపయోగం. కొన్నిచోట్ల ఆయన సొంతచరణాలను ఎన్నో చేర్చినట్లు కనబడుతూంది. అట్టిది అనవసరం. బాలచంద్రుని కళ్య పేరు సబ్బాయి అని ఉండగా, దానిని ఆయన శ్యామాంగి అని మార్చేరుట. ఇట్టి మార్పులు తగినవికావు కాబట్టి వాటిని తీసివేసిన ముద్రణ అవసరం.

పల్నాటి వీరులు పన్నెండో శతాబ్దంవారు. వారిని గురించి ఆకాలమంద జానపదగేయాలు పుట్టి ఉంటాయి. శ్రీనాథుడు ఆటుతర్వాత రెండువందలేండ్ల పిమ్మటివాడు. అతని రచనలో జనకటిగేయాలు మిశ్రమై ఉంటాయి. భాషా పరిశోధకులు పరిశోధనచేసి శ్రీనాథునికి పూర్వముండిన వీరకథాగేయాన్ని బైటపెట్టవలసుంది.

---

# కీర్తన

శ్రీమతి ఓలేటి సూర్యప్రభాదేవి

("కైలాస నిలయా, నీలకంఠ అను వరుస వలె")

తిరుపతి వాస! వెంకటేశ! – కరుణాకరా దురితకాంతార హరణా ॥తి॥
శ్రీ అలిమేల్మంగానాయక, శ్రితజన మోద సంధాయక –
శ్రియ దయాకర శేషశయన ధీర! ॥తి॥

భయద సంసార నివారణ పాపసమూహ విదారణ –
పరమయోగీంద్ర హృత్పంకజ విహార ।తి।

దేవాది దేవ సనాతన పావననామ భక్తావన –
భావభవాకార, సేవక జనాధార ।తి।

శ్రీశ సూర్యప్రభామానస వాసా దయారస మానస
ఆశావికాసీ భక్తావన సత్కీర్తీ ।తి।




## సికిందర్

గ్రీకు దేశ చక్రవర్తి అలెగ్జాండర్. అలెగ్జాండర్ మహా బలవంతుడు, ధైర్యశాలి, యోధుడు ... ! పారసీక సామ్రాజ్యాన్ని జయించి, భారత దేశం జయించాలని బయలు దేరాడు.

అది మండు వేసంగి...! మిట్టమధ్యాహ్నం... ఎండ నిప్పులు చెరుగుతోంది ! అలెగ్జాండర్ అతని సైన్యం ఒక పెద్ద అడవి చేరుకున్నారు.

అంతా అక్కడ విశ్రాంతి తీసుకోదల్చారు. చెట్లక్రింద అంతా కూలబడ్డారు. అలెగ్జాండరుకు మాత్రం ఏమీ తోచలేదు ... అలా పచారు చేస్తున్నాడు.

అతనికి దూరంగా ఒక అడవి మనిషి కనిపించాడు. "వాణ్ని బంధించి తీసుకు రండి .. !" అని ఆజ్ఞాపించాడు అలెగ్జాండర్.

భటులు యిద్దరు వెళ్లి, ఆ అడవి మనిషిని గుఱ్ఱం మీద కూర్చోబెట్టి తీసుకు వచ్చి అలెగ్జాండర్ ముందు నుంచోబెట్టారు.

నల్లగా, లావుగా అజాను బాహువుగా ఉండేవాడు. "ప్రభూ! అదో .... అదేమా గూడెం ...! రండి.... అక్కడ సత్కరిస్తాం!" అన్నాడు అడవిమనిషి.

"ఊఁ ... అలాగా ... ! సరేపద!" అన్నాడు అలెగ్జాండర్ అదోరకంగా నవ్వుతూ.

ముందు భిల్లుడు, వెనకాలే అలెగ్జాండర్, అతని అనుచరులూ బయలు దేరారు. గూడెంలోకి ప్రవేశించగానే, అడవిమనిషి ఈల వేశాడు. వెంటనే, మగవాళ్లంతా ఒకవైపు ఆడవాళ్లంతా మరోవైపూ నుంచొని స్వాగత మిచ్చారు.

అలెగ్జాండర్‌కు బలే ఆశ్చర్యం వేసింది ... ! - ఇంతలో కోయరాజు వచ్చి, అలెగ్జాండర్‌ను తీసుకుపోయి, ఉచితాసనం మీద కూర్చోబెట్టాడు.

తర్వాత భిల్లరాజు, సేవకుడి చెవిలో ఏదో చెప్పాడు. - సైనికులంతా భయపడ్డారు. కాని అలెగ్జాండర్ మాత్రం

చలించలేదు .... !

ఒక బంగారు పళ్లెంలో, కొన్ని బంగారు పళ్లు పెట్టి, "ప్రభూ! స్వీకరించండి!" అన్నాడు భిల్లరాజు.

"అరె! మీ దేశంలో చెట్లు బంగారం పళ్లు కాస్తాయా!?" అని అడిగాడు అలెగ్జాండర్.

"లేదుప్రభూ! మా దేశంలో మామూలు, తియ్యని పళ్ళేపండుతాయి....! అవే మేము తింటాము...! కానీ, ఖండ ఖండాంతరాలనుంచీ, దేశ దేశాలనుంచీ వచ్చిన మీకు యీ పళ్లు యిచ్చాము...!" అన్నాడు భిల్లరాజు.

"పిచ్చివాడా! పర దేశ చక్రవర్తులు; వెండీ, బంగారం తింటారనుకున్నావా?" అన్నాడు అలెగ్జాండర్ నవ్వుతూ!

"తినరా ....!? అయితే ... ఇంత సైన్యం ..!ఇన్ని కత్తులు...!! ఇంతశ్రమ!!! ఇవన్నీ ఎందుకూ?" అన్నాడు భిల్లరాజు.

అలెగ్జాండర్ తలవాలిపోయింది.

"ప్రభూ! మీ దేశంలో సూర్యుడు దయిస్తాడా?" అని ప్రశ్నించాడు రాజు.

"ఊఁ ..."

"పంటలు పండుతాయా?"

"ఊఁ ..."

"పశువులు వుంటాయా?"

"అన్నీ వుంటాయి.. !"

"అయితే మీకు యీ శ్రమ యెందుకూ..? పారశీక సామ్రాజ్యం జయించారు చాలదూ? భారతదేశం మీదకికూడా వచ్చారు...!....ఎందుకీరక్త ప్రవాహం ...? ఎందుకీ యుద్ధాలు ...? మీ దేశ ప్రజలెటువంటి వాళ్లో, మేము, మా దేశప్రజలు అటువంటి వాళ్లుగారా?" అని ప్రవాహంగా అడిగాడు భిల్లరాజు.

అలెగ్జాండర్ యేమీ మాట్లాడలేక పోయాడు. తల దించుకొని అలానే వుండి పోయాడు.

సుబ్బారావుశాస్త్రి

# అతి తెలివి

గంగారమ్మ అగ్రహారం అనే ఒక గ్రామంలో అవధానులు అనే ఒకాయన చాలా కాలంగా కాపురముంటున్నాడు. చాలా నెమ్మదస్తుడు కూడాను!

అదే గ్రామంలో ఒక చిన్నబడి పెట్టుకొని ఉపాధ్యాయుడుగావుంటూ జీవనం సాగిస్తున్నాడు - ఏ ఒడుదుడుకులూ లేకుండా!

ఆ రోజుల్లో శిష్యరికం చేసి విద్య నేర్చుకొంటూ వుండేవారు. ప్రతివారు గురువువద్దనే వుంటూ చదువు సాగించేవారు! అలాగే అవధాన్లుగారివద్ద అంజయ్య అనే అతను విద్యాభ్యాసానికి వచ్చి చేరాడు. అంజయ్య చాలా అమాయకుడు. ఏం చెప్పినా అట్టే నమ్మేశేవాడు. "ఎద్దు యీనింది. గుంజకు దూడను కట్టేయరా" అంటే సరే అనేవాడు.

ఇలాగే అమాయకత్వంగావుంటూ గురువుగారివద్ద శిష్యరికం చలుపుతున్నాడు అంజయ్య.

ఒకరోజున విద్యాభోధన సమయంలో మాట వరసకు గురువుగారు "ఓరేయ్ అంజయ్యా! ఏ పనైనా చెబితే ఒక పనితో రెండవపనికూడా ముగించుకు రావాలిరా, అదే తెలివితేటలకు లక్షణం. ఒట్టి అమాయకుడుగా కుర్చుంటే ఏలాగా-" అన్నాడు.

ఈ మాటలువిన్న అంజయ్య గురువుగారు చెప్పిన "ఒకపనితో రెండవపనిగూడా ముగించుకురావాలి" అన్న ఉత్తమ సందేశాన్ని కంఠస్తం చేసుకొని మనస్సులో స్థిరపరచుకున్నాడు! ఇలా కొన్నాళ్లు జరిగి పోయాయి.

కొన్నాళ్లు తరువాత గురువు అవధానులుగారికి చాలా ప్రమాదమయిన జబ్బువచ్చింది! ఆ సమయంలో శిష్యుడు అంజయ్యను పిలిచి "ఇదిగో! అంజయ్యా, నాకు ఈ రోగం తగ్గుతుందన్న నమ్మకంలేదు. చాలా బాధగా వుంది. కనుక మన ప్రక్క గ్రామంలో లింగాచార్యులు అనే వైద్యుడివద్దకు వెళ్ళి మందు తీసుకొవిరా? ఆయన రావడానికి వీలుంటుందంటే వెంట పెట్టుకుని వెంటనే తీసుకురా" అని గురువుచెప్పాడు!

గురువుగారు చెప్పిన అన్ని విషయాలకూ "ఊ" కొట్టి వెంటనే లింగాచార్యునికోసం ప్రక్క గ్రామానికి బయలుదేరాడు అంజయ్య!

అలా బయలుదేరి వెడుతుండగా మార్గమధ్యంలో గురువుగారు చెప్పిన "ఒక పనితోపాటు రెండవపని కూడా చేసుకురావాలి" అన్న విషయం జ్ఞాపకానికి వచ్చేటప్పటికి ఒక వింత ఆలోచన తట్టింది. "ఎలాగా గురువుగారికి ఈ రోగం నయంకాదు - చచ్చిపోవడం ఖాయం! చచ్చిపోయిన తరువాత దహన సంస్కారాదులకు ఒక బ్రాహ్మణుడు అవసరం! అప్పుడే కాస్త కొత్తగుడ్డ, పుల్లలూ అవసరం" అని తలుచుకొన్నాడు.

వెంటనే వైద్యునివద్దకు వెళ్ళి, గురువుగారి సంగతి అంతా లింగాచార్యునికిచెప్పి తక్షణం ఆయనను గురువుగారి యింటికి పంపించి, ఆవెనుక బ్రాహ్మణుడికోసం అంజయ్య బయలుదేరాడు - ప్రక్క గ్రామానికి!

అక్కడ వైద్యుడు అవధానులు యింటికి వెళ్ళి చక్కగా మందుయిచ్చి వైద్యం చేశాడు లింగాచార్యుడు - వెంటనే రోగం నిమ్మళించింది! శిష్యుని గూర్చి గురువుగారు "ఇంకా రాలేదు! ఏమయ్యాడో!" అంటూ ఆదుర్దాగా అడిగారు.

అక్కడ బ్రాహ్మణుడికోసం వెళ్ళిన అంజయ్య "ఈపాటికి గురువుగారు చచ్చిపోయే వుంటారు" అని దృఢంగా నిశ్చయించుకుని దహన సంస్కారాలకు కావలసినవన్ని సిద్ధం చేసుకుని బ్రాహ్మణుడితో సహా బయలుదేరి గురువుగారి గ్రామం చేరుకున్నాడు. సరిగా సాయంకాలానికి!

గురువుగారు రోగం నెమ్మదించి హాయిగా వైద్యుడు లింగాచార్యునితో అంజయ్య ఎక్కడికి వెళ్ళివుంటాడా అని ఆలోచిస్తూ కూర్చున్నాడు!

ఎంతసేపు ఎదురుచూసినా శిష్యుడు రాకపోయే టప్పటికి గురువుగారు ఖంగారు పడడం మొదలు పెట్టారు! వస్తున్నాడో, లేదో చూచిరమ్మని మనిషిని పంపించాడు. ఇంతలో సాయంకాలానికి పురోహితునితోసహా - దహన సంస్కారానికి కావలసిన సరంజామా పట్టుకుని అంజయ్య యింటికి వచ్చాడు.

అంజయ్య ఈవిధంగా వెంట ఒక పురోహితుడిని, దహన సంస్కారానికి కలప పట్టుకు వచ్చేటప్పటికి అవధాన్లుగారు చాలా ఆశ్చర్యపడిపోయారు!

"ఏరా అంజయ్యా! ఈ పురోహితుడు, ఈకలప. ఈ దహన సంస్కారపు సామగ్రి ఏమిట్రా? వూళ్ళో ఎవరైన చనిపోయారా, ఏమిట్రా పాపం!" అన్నాడు ఆశ్చర్యంలో అవధాన్లుగారు.

అంజయ్య ఏం తడుముకోకుండా "గ్రామంలో ఎవరూ చనిపోలేదండి; యివన్ని మీకోసం ఏర్పాటు చేసుకుని వచ్చాను" అన్నాడు.

"ఆఁ - ఏమిటి_నాకోసం అంటే?" - ఆశ్చర్యపడిపోతూ గురువుగారు అంజయ్యను అడిగారు.

"తమకు చాలా జబ్బుచేసి వున్నదికదా - యిక ఈజబ్బు ఎలాగూ నయంకాదని, ఎలాగా చనిపోతా రని తలచి - ముందుగానే "ఒక పనితోపాటు రెండో పనికూడా ముగించుకు వచ్చా" - అన్నాడు అమాయ కత్వంతో శిష్యుడు అంజయ్య.

"ఓరీ అప్రవాచకపు వెధవా ఎంత తెలివిహీనుడి విరా! ఇలాటి పనులు ఏవడురా నిన్ను చేయమ న్నది!" అంటూ అవధాన్లుగారు ఉగ్రుడై నానా చివాట్లుపెట్టాడు అంజయ్యని!

"అబ్బే! లేదండి! మీరు ఒకనాడు చదువు చెబుతూ ఏదైనా ఒకపని చెబితే దానికి సంబంధిం చిన ఇతర పనులుకూడ చక్కబెట్టుకురావాలి" - అని మీరు సెలవిచ్చారుకదాండీ? అన్నాడు భయంగా అంజయ్య!

ఇంతవరకు గురుశిష్యుల సంభాషణలు వింటూ నుంచున్న పురోహితుడు అంజయ్య తెలివితక్కువ తనానికీ ఎంతో నొచ్చుకుని, అంజయ్యమాటపై తొం దరపడి వచ్చినందుకు సిగ్గుపడి, అవధాన్లుగారిని క్షమార్పణ వేడుకుని తిరిగి యింటికి వెళ్ళిపోయాడు.

ఒట్టి అమాయకుడైన శిష్యుడు అంజయ్యకి యిక ఏలాటి సలహాలూ యివ్వకూడదని నిశ్చయించుకుని, మనస్సులో ఎంతో బాధపడ్డారు అవధాన్లుగారు!

తన తెలివితక్కువ తనానికి నవ్వాలో_ఏడ్వాలో తెలియక అలాగే నిలబడిపోయాడు అమాయకుడైన అంజయ్య.

చూశారా! అమాయకత్వం ఎంత ప్రమాదమో!

ఎ. మల్లిఖార్జునరావు

---

తండ్రి:-అబ్బాయ్! కేవలను సరకులు మనమెంత పొదుపుగా వాడుకున్నామో అన్ని వస్తువులూ అలా వాడుకోడం మంచిది.

కుమారుడు:-అందుకనే నాన్నా! పరీక్షలయినా రాత్రిపూట చదువుకుంటే కిరసెన్ ఆయిల్ ఖర్చని చదువు మానేశాను.

♦ ♦ ♦

"ఏంరా రామూ! నిన్న బడికిరాలేదు ఎందుకు?"

"తీరా బయలుదేరేసరికి ఒంటి బ్రాహ్మణుడు ఎదురైనాడురా"

♦ ♦ ♦

"ఏమండోయ్! వంట యింట్లో ఏదో చప్పుడగుతున్నది - దొంగలేమో కొంచెము లేచి చూడండీ!"

"ఇప్పుడీ చీకట్లో ఏంకనుపిస్తుందీ - తెల్లవారిన తర్వాత చూద్దాంలేవే"

♦ ♦ ♦

గురువు:-వరే అబ్బాయ్? ఉదయంపూట అర్ఘ్యంవిడిస్తే చాల పుణ్యం

శిష్యుడు:-అలాగాదు గురువుగారూ! - అర్ఘ్యం విడిస్తేనే అంత పుణ్యమైతే సంధ్య నంతా విడిచిపెడితే యింకెంత పుణ్యమో!

అల్లంకి శైలాయ్

# కేసరి విద్యాసంఘ వార్షికోత్సవము

---

ఈ నెల ౪వ తేదిన కేసరి హైస్కూలు ఆవరణలో కేసరి విద్యా సంఘ వార్షికోత్సవము మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కే. కామరాజ్ గారి అధ్యక్షతన అత్యంత వైభవముగా జరిగింది. విద్యార్థులకు మద్రాసు మేయరు శ్రీ వి. ఆర్. రామనాథఅయ్యర్ బహుమతులు పంచిపెట్టారు.

కేసరి విద్యాసంఘ అధ్యక్షులు కాప్టన్ టి. యం బాలకృష్ణ నెడుంగాడి స్వాగతము చెప్పుచూ విద్యావ్యాప్తికిగాను కీ॥ శే॥ డాక్టరు కే. యన్. కేసరిగారు చేసిన సేవను స్మృతికి తెచ్చారు. బీదలపట్ల, అనాధలపట్ల వారు చూపిన ఔదార్యము జగద్విదితమన్నారు. మద్రాసు నగరంలోని తెలుగు బాలబాలికలు మాతృభాషలో విద్యావసతులు పొందడానికి ముఖ్యమంత్రి సహాయ, ప్రోత్సాహాలు లభించగలవని ఆశిస్తున్నామన్నారు.

శ్రీ బండి శ్రీహరిరావునాయుడుగారు కార్యదర్శి విద్యాసంఘ 1955 వార్షిక నివేదికను సమర్పిస్తూ సంఘం నిర్వహిస్తున్న కేసరి హైస్కూలు, త్యాగరాయనగరునందలి కేసరి మాధ్యమిక, కేసరి తెలుగు ప్రాథమిక పాఠశాలల పురోభివృద్ధిని వివరించారు.

ప్రారంభంలో ముఖ్యమంత్రి శ్రీ కామరాజ్ ఉపన్యసిస్తూ మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్రుల శ్రేయో పురోభివృద్ధులను వాగ్దానం చేశారు. తెలుగువారితో బాటు మలయాళం, కన్నడం మాట్లాడేవాళ్లు సయితం నివసిస్తున్నారు కాబట్టి అందరు విద్వేషభావాలు లేకుండా సమైక్యతతో వ్యవహరించడం ఎంతైనా అవసరమన్నారు.

వారి సాంస్కృతిక, సాంఘిక అవకాశాలు ప్రభుత్వము సంరక్షించగలదని వాగ్దానం చేశారు అందరు సమరస సమైక్యతలతో రాష్ట్రపురోభివృద్ధికి తోడ్పడాలని శ్రీ కామరాజ్ గారు విజ్ఞప్తి చేశారు.

ముఖ్యమంత్రి ఉపన్యాసమును తెలుగులో అనువదించవలసినదిగా కొందరు విద్యార్థులు కోరినప్పుడు ముఖ్య మంత్రి తమ మాతృభాషతో బాటు మరికొన్ని ప్రాంతీయ భాషలను నేర్చుకొనుట మంచిదని విద్యార్థులకు ఉద్బోధించారు.

మద్రాసు మేయర్ బహుమతులను పంచిపెట్టు సందర్భమున ఉపన్యసిస్తూ డాక్టరు కే. యన్. కేసరి గారి జీవితాన్ని యువకులు ఆదర్శంగా తీసికోవాలనియు, కేసరిగారు తెలుగువారైనా మలయాళవనితను వివాహమాడి ఆంధ్ర కేరళీయులకు సంబంధ బాంధవ్యాలు నెలకొల్పారన్నారు.

పెక్కుమంది బాల బాలికల తలిదండ్రులు, పురప్రముఖులు వార్షికోత్సవంలో పాల్గొన్నారు.

కేసరి హైస్కూలు, మిడిల్‌స్కూలు విద్యార్థుల వినోద కార్యక్రమాలు జరిగిన తరువాత బహుమతుల ప్రదానం జరిగింది.

S. S. L C. పరీక్షలో హెచ్చు మార్కులు వచ్చినందుకు కుమార్ ఎ. వి. రమణకు శివభోగం బంగారు పతకం, సంగీతములో ప్రవీణతకు బెంగుళూరు నాగరత్నమ్మగారి బంగారు పతకములు కుమారి ఆర్. సూర్యకుమారి, కుమారి వి. బాలనాగమ్మలకు, కంపోజిట్ లెక్కలలో S. S. L. C. పరీక్షలో హెచ్చు మార్కులు వచ్చినందుకు కుమార్ రమణకు బహుమతి పంచిపెట్టబడినవి.

కేసరి హైస్కూలు హెడ్మాష్టరు కే. వెంకటరాజుగారు వందన సమర్పణముచేసిరి.

---




జగన్నాథ రథచక్రాలు : శ్రీ పులిపాక జగన్నాధరావు బి. ఏ., హిందూకళాశాల, గుంటూరు. వెల 0-4-0.

ఇది చిన్న కథల సంపుటి. రచన గంభీరమైన భావాలతో సాంఘిక జీవితంలోని వాస్తవపరిస్థితులను చిత్రిస్తూ పాఠకులలో మానసిక పరివర్తన కలుగజేయునట్లుగా సాగినది. చదువుచున్నంతసేపు ఆత్మవిచారమును ప్రేరేపిస్తున్న యీ కథానికలు ప్రజలకెంతైనా తోడ్పడగలవు.

వ్యాసవాణి : శ్రీ జాస్తి వేంకటనరసయ్య. ప్రచురణకర్తలు, భారతీ సన్మాన సంఘము, పామర్రు, కృష్ణాజిల్లా, వెల 0-6-0. ప్రతులకు గ్రంథకర్తకు; చిలకలూరిపేట, గుంటూరుజిల్లాకు వ్రాయవచ్చును.

ఇందులో సాహిత్యము, కళారాధన, సంస్కృతి, లలితకళలు, గేయకవిత, కవి, కర్మయోగి, పఠనమందిర గ్రంథాలయ లాభములు, చిత్రశిల్పములు, అనే శీర్షికలతో చిన్నచిన్న వ్యాసములు కలవు. ఇవి కవిత్వము, కళ, సాహిత్యములాంటి విషయాలలో ప్రవేశానికి అనువైనవిగా నున్నవి.

కాకతీయరాజుల చరిత్ర : శ్రీ కొత్తబాపయ్య చౌదరి, సంగం జాగర్లమూడి, గుంటూరు జిల్లా. వెల 0-8-0.

ఆంధ్రదేశమును వైభవోపేతంగా ఒకప్పుడు పరిపాలించిన కాకతీయాంధ్రరాజుల పరాక్రమ సాహసాలు, ప్రజారంజకమైన పరిపాలనలాంటి చరిత్రాత్మక విషయాలను వివరిస్తూ జాతీయ భావాలను రేకెత్తిస్తున్నదీ పద్యరచన.

రెడ్డి, కాకతీయరాజులయొక్క యశస్సును చిరస్థాయి చేయుటకని ఉద్దేశించిన యీ రచన మనోజ్ఞంగా నున్నది.

కవిత : శ్రీ జాస్తి వేంకటనరసయ్య, చిలకలూరిపేట, గుంటూరు జిల్లా. వెల 0-8-0.

ఆది, ఆధునిక కవుల పద్యగేయాలు తెలుగు కవితను, భావను, సంస్కృతిని, సాహిత్యాన్ని ప్రశంసిస్తున్నవి యిందుగలవు. వీనిని సేకరించి చిన్న పుస్తకముగా రూపొందించిన సంపాదకుడు అభినందనీయుడు.

♦ ♦ ♦

'మాతృసేవ' అయిదవ జన్మదిన సంచిక మా కార్యాలయమునకు చేరినది. సంపాదకులు శ్రీ శ్రీధర్ గారు దీక్షాకంకణం కట్టుకొని విద్యావిజ్ఞానరంగాలలో సేవచేయు ఆసక్తితో యీ పత్రికను నిర్వహిస్తున్నందుకు అభినందనీయులు. ఇందులో 'కౌశిక'గారి రాజకీయ వ్యాఖ్యలు ఒక ప్రత్యేకత. ఇందలి కథానికలు, నాటికలు, వినోదవిజ్ఞానాల వ్యాప్తితోబాటు అభ్యుదయ రచయితలకు యీ పత్రికద్వారా అమరుచున్న ప్రోత్సాహం విశేషం. వెల 0-4-0. కార్యస్థానం 'మాతృసేవ' కార్యాలయం, ఉద్యోగాంమ్, కుప్పం రోడ్డు, తండియార్‌పేట, మద్రాసు - 21.

# సంపాదకీయములు

## కేసరి విద్యాలయాల పురోభివృద్ధి.

పూజ్యులు డాక్టరు కేసరిగారు నిర్మించిన విద్యాసంఘం, అది నిర్వహిస్తున్న విద్యాలయముల పురోభివృద్ధి అభినందనీయము.

మద్రాసులో మాతృభాషలో విద్యావసతులకుగాను ఏర్పడిన కేసరి విద్యాలయములు బాలబాలికల విద్యావిజ్ఞానములతోబాటు, వ్యక్తిత్వ పరిరక్షణకు సయితం వినియోగపడవలసియున్నవి. కాని వార్షికనివేదిక ననుబట్టి మద్రాసు - త్యాగరాయనగరమునందలి తెలుగువారు మాధ్యమిక పాఠశాలను తమ బాలబాలికల విద్యా వసతులకు వినియోగించుకొనుటలేదా యనిపించుచున్నది.

మద్రాసు నగరంలోని తెలుగువారు తమ బాలబాలికలకు మాతృభాషలో విద్యావసతులకు ఉన్న తెలుగు విద్యాలయములను పోషించుకొని వినియోగించుకోవడం, అవసరమున్నచోట విద్యాలయములను నెలకొల్పుకోడం అత్యవసరము.

కేసరి విద్యాసంఘ వార్షికోత్సవ సందర్భమున మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కె. కామరాజ్ తెలుగువారి సాంస్కృతిక సాంఘిక, అవకాశాలు అందరితోబాటు పరిరక్షించబడగలవని వాగ్దానంచేశారు కాబట్టి తెలుగువారు తమ బాలబాలికల విద్యావసతులపట్ల అత్యంత ఆసక్తికలిగి మెల్గాలని మావిజ్ఞప్తి. దాంతోబాటు విద్యార్థులు శ్రీ కామరాజ్ ఉద్బోధించినట్లు మాతృభాషతోబాటు ఒకటి, రెండు ప్రాంతీయభాషలను నేర్చుకోడం ఎంతో ఉపయుక్తము కాగలదు.

కేసరి విద్యాలయములు కలకాలము వర్ధిల్లి, తెలుగు బాలబాలికల విద్యావిజ్ఞానాల వ్యాప్తికి తోడ్పడడానికి నగరంలోని తెలుగువారితోబాటు ఆంధ్రరాష్ట్రములోనివారు సయితం శ్రద్ధ, ఆశక్తులను చూపాలి.

## శ్రీ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రులుగారి నిర్యాణం.

శ్రీ వెంకటేశ్వరశాస్త్రులుగారి మరణం పండిత పామరులకు మితిలేని సంతాపం కలిగించింది. వారు ప్రచురణకర్తగాచేసిన సారస్వతసేవ జగద్విఖ్యాతము. మద్రాసు నగరంలో జాతీయ ఉద్యమవ్యాప్తికి వారి అండదండలు, సేవ అమోఘంగా నుపకరించినవి. శ్రీ శాస్త్రిగారు కవులను, పండితులను అనేకులను పోషించి, ఆదరించి సన్మాన సత్కారాలు జరిపేవారు. వారి ఔదార్యమును, ధాతృత్వమును అశేషప్రజలు చవిచూచారు.

'త్రిలిఙ్గ' పత్రికా సంపాదకులుగా శ్రీ శాస్త్రులుగారు చేసిన సేవ అపారం. భాషోద్ధారకుడుగా పేరొందిన వీరి నామము చిరస్మరణీయమగుగాక! వీరి ఆత్మకు పరిపూర్ణ శాంతి సమకూరునట్లు వీరి అమూల్యమైన కృషి చిరకాలము కొనసాగుచుండాలని మా ఆశ!



# శ్రీ మన్మథనామ సం॥ర మాఘ - ఫాల్గుణమాసములు

| | | | |
|---|---|---|---|
| ఫిబ్రవరి నెల 1956 సం॥ | 16 | గు | పం 53-21 రేవ 35-6 |
| | 17 | శు | ష 50-34 అశ్వ 34-21 సిద్ధియోగః |
| | 18 | శ | స 46 40 భర 32-28 రథసప్తమి |
| | 19 | ఆ | అ 41-47 కృ 29-32 భీష్మాష్టమి |
| | 20 | సో | న 36-10 రో 25-51 |
| | 21 | మం | ద 30-1 మృ 31-35 |
| | 22 | బు | ఏ 23-39 ఆర్ద్ర 17-2 భీష్మైకాదశి |
| | 23 | గు | ద్వా 17-22 పున 12-32 భీష్మద్వాదశి |
| | 24 | శు | త్ర 11-20 పుష్య 8-15 అమృతయోగః తిరువత్తూరు పొగడమానుసేవ |
| | 25 | శ | చతు 5-48 ఆశ్రే 4-27 |
| | 26 | ఆ | ○ పౌ 1-2 పాడ్యం 55-55 మఘ 1-25 పూఫ 57 37 వ్యాసపూజ |
| | 27 | సో | కృ విది 54-20 ఉఫ 58-6 |
| | 28 | మం | తది 52-47 హస్త 58-22 త్యా 4-4 సిద్ధియోగః |
| | 29 | బు | చ 52-49 చిత్త 59-52 |
| మార్చి నెల 1956 సం॥ | 1 | గు | పం 53-54 స్వాతి 60-10 త్యా 4 12 |
| | 2 | శు | ష 56-7 స్వాతి 2-5 |
| | 3 | శ | స 59-21 విశా 6-36 |
| | 4 | ఆ | అ 60-10 అనూ 11-19 జానకీజయంతి |
| | 5 | సో | అ 3-31 జ్యే 16-34 |
| | 6 | మం | న 8-0 మూల 22 30 |
| | 7 | బు | ద 12-47 పూషా 38-34 |
| | 8 | గు | ఏ 17-29 ఉషా 34-29 ద్వాదశితిథిః |
| | 9 | శు | ద్వా 21-55 శ్రవ 40-7 శూన్యతిథిః |
| | 10 | శ | త్ర 25-46 ధని 45-8 త్యాజ్యాభావః మహాశివరాత్రి |
| | 11 | ఆ | చతు 28-48 శత 49-15 |
| | 12 | సో | ● అమా 30-49 పూభా 52-24 |
| | | | ఫాల్గుణమాసము |
| | 13 | మం | శుక్ల పా 31-42 ఉభా 54-26 |
| | 14 | బు | విది 31-19 రే 55-10 |
| | 15 | గు | తది 29 40 అశ్వ 54-41 త్యా 3-59 |

Printed & Published by Dr. S. Seshagiri Rao, at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.



కుమారి చిత్ర

10 సం॥ల బాలిక. జనవరి 26 వ తేదిన అణ్ణామలై మందిరం (మద్రాసు)లో భరతనాట్య ప్రదర్శనము జరిపింది. అధ్యక్షత వహించిన జస్టిస్ శ్రీ ఎ. యస్. పి. అయ్యర్ గారు ఆమె నైపుణ్యాన్ని గురించి అభినందించారు.

ఈ చిన్నారి కలకత్తా కెమికల్ అసిస్టెంటు మేనేజరు శ్రీ ఎ. వి. వి. రాఘవన్ గారి కుమార్తె, శ్రీ పి. జి. చెల్లప్పగారి శిష్యురాలు

